
శ్రీ అనంతలక్ష్మి ఆర్ట్ పిక్చర్స
ప్రేమలు-పెళ్ళిళ్ళు
దర్శకత్వం:
వి.మధుసూదనరావు
నిర్మాత:
డి.భాస్కరరావు
ANNAPURNA
STUDIO
Roophala

# ఉత్తరాలు

## సీరియల్

'ఆశకు సంకెళ్ళు' కె. రమలక్ష్మిగారి సీరియల్ ఈ వారంతో అయిపోయినందుకు చాలా విచారం కలిగింది. రచయిత్రి చాలా చక్కగా పరిస్థితులన్నీ కళ్లకు కట్టినట్లుగా రచించారు. రాఘవయ్యలాంటి ఆడపిల్లల తండ్రులు ఎంతో మంది ఈ విశాల ప్రపంచంలో ఉన్నారు. కానీ ఈ రోజుల్లో ఆడపిల్లలు కన్న తల్లిదండ్రులు ఆ పిల్లలకి పెళ్లిళ్లయ్యే వరకూ ప్రాణాలరచేతిలో పెట్టుకుని జీవిస్తున్నారు. పాపం రాఘవయ్య బ్రతికికూడా తన కుటుంబం అష్టకష్టాలు పడుతున్నందుకు, చనిపోయి అయినా వాళ్లకి మేలు చేద్దామని త్యాగం చేశాడు. కానీ ఫలితం శూన్యం. చదువుచున్నంత సేపూ మా హృదయాలు ఎంతో బరువెక్కాయి.

కె. శ్రీనివాసాచార్యులు, కె. ఎ. వి. ఆర్.
సత్య, నర్సీపట్నం రోడ్

## కథలు

4—1—74 పత్రికలో పెంగాయిజమ్ కథ చక్కగా చదువుతున్నంతసేపూ ఉత్సాహంగా ఉంది. కాని రచయిత కథలో వ్రాసినట్లుగా పూర్ణా మార్కెట్ దగ్గర బస్సు ఎక్కి వాచ్ హౌసు దగ్గర దిగినట్లుగా వ్రాసేరు. పూర్ణా మార్కెట్ నుంచి వాచ్‌హౌసుకి బస్సులు లేవన్న విషయం రచయితకు తెలియనట్లుగా ఉన్నది.

వి. పి. జగదారి (విశాఖపట్నం).

* * *

బాలట్ పోటీలో నా కథ "పూవులు— మాలలు" ప్రథమ బహుమతి పొందిందని తెలిసి చాలా ఆనందం కలిగింది. ముఖ్యంగా ఇది పాఠకుల నిర్ణయం కావడం నాకు మరింత సంతోషాన్ని కలిగించింది. ఎంతో ఉత్సాహంతో ఈ బాలట్‌లో పాల్గొని తమ తమ నిర్ణయాలను ప్రకటించిన పాఠకులకు—పత్రికాముఖంగా నా కృతజ్ఞతలు తెలియపరచుకోడానికి— ఈ ఉత్తరం రాస్తున్నాను. పాఠకులకు నా నూతన సంవత్సర శుభాకాంక్షలందజేయగోర్తాను.

వసుంధర (భువనేశ్వర్)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 25–1–1974
శ్రీప్రమాదినామ సం. మాఘమాస శు. విదియ
సంపుటము : 67 సంచిక : 22
స్థాపితం 1908

సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి విజయలలిత
(ఫోటో : ఎం. ఎ. మోహన్‌రావు)

## మనలో మాట

పాఠకులకు రిపబ్లిక్ దినోత్సవ శుభాకాంక్షలు!

*   *   *

గాలిపటాలు నాటకం యీ వారం నుంచి ప్రారంభించాము రచయిత శ్రీ నూరత్తు వేణుగోపాలరావు ఉద్యోగ రీత్యా ఇన్‌స్పెక్టర్ జెనరల్ ఆఫ్ పోలీసు. ఆంధ్ర ప్రభుత్వం వారిని ప్రస్తుతం కేంద్రానికి డెప్యుటేషన్ మీద పంపించింది. వారు ఆంగ్లంలోకూడా



నేరస్థులు–నేరాలు, మనదేశంలో వాటి తీరు తెన్నులకూ, సంబంధించి కొన్ని గ్రంథాలు వ్రాశారు. "మర్డర్: ఏ పైలట్ స్టడీ ఆఫ్ అర్బన్ పాటర్న్స్"–"జువినైల్ డెలిన్‌క్వెన్సీ: రోల్ ఆఫ్ ది పోలీస్" అనే గ్రంథాలు ప్రచురించారు.

1968 లో శ్రీ వేణుగోపాలరావు 'దోషం' అనే తెనుగు హాస్య నాటికను వ్రాశారు. ఢిల్లీలో ప్రదర్శించినప్పుడు దానికి మంచి ప్రశంసలు లభించాయి. 'గాలిపటాలు' నాటకం కూడా ప్రదర్శించారని, బాగా రక్తి కట్టిందని తెలుస్తోంది.

*   *   *

డాక్టర్ వెంకటేశ్వరరావుగారి "ప్రాస్టేట్ గ్లాన్‌డిన్స్" అనే వ్యాసం యీ సంచికలో వేసిన కారణంగా మామూలుగా వేస్తున్న 'డాక్టర్ సలహాలు' శీర్షిక వేయలేదు. పై వారం నుంచీ యీ శీర్షిక ఎప్పటివలె కొనసాగుతుంది.





## చిన్నారి చిలిపి చేష్టలు

మా పాప వయసు ఐదు సంవత్సరాలు. పేరు సుశి ప్రొద్దుట లేచిందగ్గర నుంచి రాత్రి నిద్రపోయే వరకు ఏవేవో వింత ప్రశ్నలు వేస్తుంటూ వుంటుంది.

ఒక రోజు మా చంటివాడి (మూడు సంవత్సరాలు) కి బిస్కట్లు కోసమని సుశీని చంటివాడితోసహా సమీపంలో వున్న ఓ షాపుకు పంపాను. అటు నుండి రాగానే మా బాబు ఏడుస్తూ తన చేతి వ్రేళ్లను చూపించాడు. వాడి వ్రేలికి వుండాల్సిన ఉంగరం లేదు. నాకు కాళ్లల్లో ఒణుకు పుట్టుకు వచ్చింది. ఏమైందబ్బా అనుకుంటూ సుశీ నడిగాను, అది తీసుకుందేమోనని. ఎందుకంటే తనకు లేకుండా వాడికి చేయించామని దానికి చెప్పలేనంత ఉడుకుమోత్తనం. దానికి సమాధానంగా సుశి "ఇంకెక్కడిది. ఊత్ కాకి! ఆకాచంలోనికి ఎగిరిపోయింది" దాని పరిహాసానికి నాకు ఒళ్లు మండి, విషయం చెప్పమని గదమాయించాను. భయంతో "నిజమమ్మా! ఆకాచం లోనే పడిపోయింది" అని ఏడవటం ప్రారంభించింది... నాకు విషయం అర్థంకాక "ఆకాశంలో పడిపోవట మేమిటే" అన్నాను.

"చూయిత్తాను రమ్మం"టూ నన్ను రోడ్డు మీదికి తీసుకు వెళ్లింది రోడ్డుమీద వర్షం నీరు నిలిచిఉన్న ఓ గొయ్యి దగ్గరకు తీసుకు వెళ్లింది. "ఇక్కడేనమ్మా! వాడి ఉంగలం నేను పెట్టుకుంటుంటే జారిపడిపోయింది... అదిగో యీ ఆకాచంలోనికే" అంటూ చూపించింది. ఏమిటో అనుకున్నాను. నిశ్చలంగా నిలిచివున్న ఆ నీటిలో ఆకాశం – మేఘాల ప్రతిబింబలు కనపడుతున్నాయి!

నేను చేయి పెట్టబోయాను. "ఒద్దమ్మా! నువ్వూ ఆకాచంలోనికి జారి పలతావు" అంటూ నన్ను వారించింది... వెదకగానే అదృష్టవశాత్తు ఉంగరం దొరికింది.

ఆ రాత్రి– విషయం తెలుసుకున్న వాళ్ల నాన్నగారు "ఆకాశంలోనికి వెళ్లిపోతే రాదని నీ కెవరు చెప్పారమ్మా?" అని అడిగితే మా సుశి "మలేమొ! ఆవేళ యీ ఉంగరం నాకు కావాలని నేను ఏలుత్తుంటే ఊత్ కాకీ! అదిగో ఆకాచంలోనికి ఎగిరిపోయింది... యిక లాదు అందిగా అమ్మ" అని వింతగా కళ్లు పెద్దవిగా చేసి చేతుల్ని ఊపుతూ చెప్పింది. ఒక్కసారిగా ఆ వేళ నేను



ఉంగరం కావాలని మారాం చేస్తున్న సుశి దృష్టి మరల్చాలని చేసిన ప్రయత్నం గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను.

— కొమ్మనాపలి లక్ష్మి
హైదరాబాదు

అది మా బిడ్డ అయితే కావచ్చు! కాన్పు భరించ వలసిన బాధ్యత నీదే!

అధికార పక్షం

నల్ల ధనం

ఒకరిని చూసి మరొకరు కాపీ!

బ్యాంకుల జాతీయాకరణ పథకం

శివసేన

బొంబాయిని పరిపాలించేది ఎవరు?

నాకు న్యాయంగా రావలసిన భాగం ఇదేనా?

ఆంధ్రా

తెలంగాణా

# హైదరాబాద్ నోట్ బుక్

**సమైక్యానికి మూడు ముళ్ళు :**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్ర అభివృద్ధి నిమిత్తం ప్లానింగ్ బోర్డును, మూడు ప్రాంతీయ అభివృద్ధి సంఘాలను నియమించడంతో రాష్ట్ర సమైక్యాన్ని పదిలం చేయడానికి మూడుపేరులా కలిపి మూడుముళ్ళు వేసినట్లయింది. ఈ సంఘాల అధ్యక్షులు శ్రీయుతులు రేబాల దశరథరామరెడ్డి, కె. వి. నరసప్ప, పి. జగన్నాథరావు, అడ్హాక్ కాంగ్రెస్ సంఘాధ్యక్షుడైన కాంగ్రెస్ కురువృద్ధుడు, సమైక్యవాది అయిన శ్రీ వి. వెంకట నారాయణ రాష్ట్ర భవితవ్యం సమైక్యంగా రూపొందడంలో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుకు బాసట కాగలరనడం నిర్వివాదం.

**ఆస్పత్రులు కావాలి !**

జంటనగరాల జనాభా పెరగడంవల్ల రోగుల అవసరాలకోసం మరొక జనరల్ ఆస్పత్రి ఏర్పాటు చేయడం విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ముఖ్యమంత్రి ఈనెల 1 వ తేదీన ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో 34 వ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ అన్నమాటలు ఎంత త్వరలో కార్యరూపం ధరిస్తే అంతమేలనిపిస్తుంది ప్రస్తుతం జంటనగరాలలోని ఆస్పత్రుల వరండాలలో పడివున్న రోగులను చూస్తే, ఎన్ని కొత్త ఆస్పత్రులయినా కావాలనడం తప్పదని ఎవరైనా అంటారు. ప్రదర్శన సంఘానికి మూలస్తంభాలయిన శ్రీశంకర్జీ, శ్రీ వి. మల్లేశం మొదలయినవారే ప్రదర్శనాలతో ప్రజాసేవ చేస్తున్నట్లే ఒకపెద్ద ఆస్పత్రి స్థాపించి ఎందుకు సేవ చేయరాదు — అనుకొన్నాను. వారు ఆలోచింతురుగాక !

**పిట్ట గోడలు :**

ఇది అడ్డుగోడలను కూల్చివేసేయుగం. మానవునికీ మానవునికీ మధ్య అడ్డుగోడలుండరాదని అహర్నిశం నినాదాలు వింటూనే వున్నాము. కాని, సినిమా హాలులముందున్న అడ్డుగోడలు తొలగించాలని ఆరోగ్యవాదులకు ఎందుకు తట్టలేదో ! జంటనగరాలలో ఏ సినిమా హాలు చూడండి ఎదురుగా వున్న అడ్డపిట్టగోడ కింది భాగం మూడడుగుల మేర తడిసి కంపుకొడుతూ వుంటుంది. ఆ వాసనకు మూడడుగులు కావాలని బలిచక్రవర్తిని అడగడానికి వారు ఏ సినిమా ప్రొప్రయిటర్నో అడిగితే బాగుండేది, ప్రేక్షకులు మూత్ర దుర్గంధంతో ముక్కులు మూసుకొనిలోపలికి వెళ్ళవలసిన అవసరం తప్పేది. విభావాను భావాదులకు బుడుపు మొదలయినవి కారణమంటారు ఆలంకారికులు. సినిమా పిట్టగోడలకు మూత్రపిండాల సంచలనానికి కారణమేమిటో చెప్పినట్లు గుర్తులేదు. "సినిమావరిసరాలు — ప్రేక్షకుల మూత్రపిండాలు" అని విశ్వవిద్యాలయంవారు థీసిస్ విషయంగా ప్రకటిస్తే వైద్య శాస్త్రానికి ఎంతో మేలు చేకూరవచ్చునేమో! ఏమైనా, పురపాలకులు ఈ పిట్టగోడలను తొలగించి ఆరోగ్య విస్తరణకు తోడ్పడడం అవసరమనే ప్రేక్షకుల్లో నేనూ ఒకణ్ణి.

**తమిళనాడులో తెలుగు :**

తమిళనాడు శాసనసభ్యులు, దక్షిణాంధ్ర నాయకులు, విద్వాంసులు అయిన శ్రీ కె. ఎస్. కోదండరామయ్య (ఎం. ఎ., ఎల్. టి. హోసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి కార్యదర్శి శ్రీ పి. మునుస్వామి ఈనెల 1 వ తేదీన ఇక్కడ పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ, "తమిళనాడులో 50 లక్షల మంది తెలుగువారున్నారు. ఒక్క ధర్మపురి జిల్లాలోనే తెలుగుబోధన భాషగా 500 (ఐదువందల) ప్రాథమిక పాఠశాలలు, 16 ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. తెలుగును ద్వితీయ భాషగా చేయడానికి తమిళనాడు శాసనసభలో ఒక తీర్మానం ప్రతిపాదించనున్నాము. తమిళనాడులో 150 మంది తెలుగు పండితులున్నారు. త్వరలో ఒక మహాసభ జరుపనున్నాము" అన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రజలు ఎంతో ఉదారంగా తమిళాది పరిసర భాషలకు పూర్తిగా అవకాశం ఇస్తున్నప్పుడు తమిళనాడు ప్రభుత్వం 50 లక్షల మంది కోరికను కాదనదనే ఆశిద్దాము.

**గ్రంథాలయ మహాసభ :**

మంత్రి శ్రీ దేవానందరావు డిసెంబర్ 30 వ తేదీన నిజాం కళాశాల ఆవరణలో హైదరాబాద్ గ్రంథాలయాల మహాసభను ప్రారంభిస్తూ, లైబ్రరీ సర్వీసులను రాష్ట్రీయం చేయడం గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నదని అనడం గ్రంథాలయోద్యోగులకు ఆశావహంగానే వుంది. గ్రంథాలయాలు నేటి సమాజంలో అత్యవసరమైనవి గనుక, తదుద్యోగులకు తగిన గతి కల్పించడం హర్షణీయం. ప్రధానాధికారి వైస్ చాన్సలర్ శ్రీ నరోత్తమరెడ్డి, అధ్యక్షుడు శ్రీఎల్. ఎన్. గుప్త అన్నట్లు గ్రంథాలయాభివృద్ధికి ధనం విరాళంగా అవసరం గనుక ప్రభుత్వం దీనిని సమకూర్చాలి. అంతర్జాతీయభాష అయిన ఆంగ్లం వేయిరేకులుగా విస్తరిస్తున్నది గనుక ఆంగ్ల పుస్తకాలు విరివిగా కొనాలని శ్రీ దేవులపల్లి రామానుజరావు సూచించడం బాగుంది.

ఆరోగ్యశాఖామంత్రి శ్రీ కె. రాజమల్లు డిసెంబర్ చివరివారంలో రెండు నూనె మిల్లుల మెరుపు తనిఖీచేసి కల్తీ వేరుసెనగ నూనెను పట్టుకొని నిజమైన ఆరోగ్య మంత్రి అనిపించుకొన్నారు. కల్తీని చాణక్యుడు మొదలు అందరూ ఖండించారు "ప్రజల ప్రాణాలు తీస్తున్నాము. ఇది కూడదు" అనే భావం వ్యాపారస్తులకు కలిగించడానికి ఏంచేస్తే బాగుంటుందో మంత్రి ఆలోచించాలి.

**ఉపశ్రుతి :**

"ఇదేమిటండీ ! అంతగా కొట్టుకున్నారు, మళ్లీ కలిసిపోయారు. బలే వాళ్లండీ తెలుగువాళ్లు!" అన్నాడు ఒక తమిళ మిత్రుడొక తెలుగువాడితో. "తన బిడ్డ కొట్టినాపోదు, పరాయిబిడ్డ పెట్టినా వుండదు అని మా సామెత" అన్నాడు తెలుగువాడు.

— తిరుమల రామచంద్ర

# ఒక వారం విపరీతం

**అమ్మాయిలతో వ్యాపారం ...**

ఢిల్లీలోని ఓ అగ్నిమాపకదళానికి చెందిన అధికారి శర్మ అనే ఆయన ఓ వ్యభిచార గృహం నడుపుతున్నారట. ఆ గృహానికి ఉస్మాన్ఖాన్ అనే ఆయన హైదరాబాదు నుంచి అందకత్తెల్ని సరఫరా చేస్తున్నాడట. పోలీసు యిటీవల శర్మగారినీ, ఖాన్ గారినీ, శర్మగారి భార్యనూ, మరో నలుగుర్నీ అరెస్టు చేశారట. అందకత్తె ఒక్కొంటికి నెలకు ఎనిమిది వందల రూపాయలు చొప్పున తనకు నెలకు 2,200 ఆదాయం ఉందని ఖాన్గారు పోలీసులతో అన్నారట. పైగా ఆ అందకత్తెలందరూ ఒప్పుకొని తనతో హైదరాబాద్ నుంచి వచ్చారని అన్నారట—

* * *

బెంగుళూరు చామరాజపేట నివాసి 21 ఏళ్ళ మల్లిఖార్జునరావు గత కొన్నాళ్ళ (కొన్ని ఏళ్ళ)గా ఉద్యోగం కోసం వెతికి వెతికి, ఈ లోకంలో ఉద్యోగం దొరకనందువల్ల ఉరిపోసుకుని, ఆత్మహత్య చేసుకున్నాడట— అక్కడ మాత్రం !

**పెళ్లిమీద పెళ్లా ?**

తాను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్న వ్యక్తిని వివాహం చేసుకోబోవటం లదని హిందీనటి వహీదారెహమాన్ అన్నారట. అదేమంటే తాను పెళ్ళాడదలుచుకున్న ఫరీద్ అహమ్మద్ షౌకత్కు యిదివరకే ఒక పెళ్లి అయ్యిందట, అంతేకాక అతనికి పిల్లలు కూడా ఉన్నారని ఆవిడ తెలియజేసిందట.

**పోలీసు శవం ...**

హైదరాబాద్ సుల్తాన్ బజారు పోలీసు

(48 వ పేజీ చూడండి)

సార్! మీరు మంత్రియా!
మద్యనిషేధం ఎత్తేశారు! అలాగే
వ్యభిచారం చట్టబద్ధం
చేసేస్తే ప్రభుత్వానికి
బోలెడంత ఆదాయం!



# ప్రాస్టా గ్లాన్‌డిన్స్

డా. కె. వెంకటేశ్వరరావు

రోజు రోజుకీ ముందడుగు వేస్తున్న విజ్ఞాన వాహినిలో వైద్యశాస్త్రం చాలమటుకు అన్నిటికన్నా ప్రథమంగానే వుంటూ వస్తున్నది.

కొన్ని వేలకొలది ఔషధాలు వాడుకలో వున్నా, ఇంకా చాలా రోగాలకు మందులు కనుగొనబడలేదు. ఇంతవరకూ కనుగొన్న మందులకుకూడా సరి అయిన ఉపయోగాలను గురించి తెలుసుకోవటం జరగలేదు. ఈ విషయమై ఔషధాల పనితనంయొక్క పునఃపరిశీలన చాలా అవసరం.

## ప్రాస్టా గ్లాన్‌డిన్స్

ఇలా పునఃపరిశీలన జరిగిన కొద్ది ఔషధాలలో ప్రాస్టాగ్లాన్‌డిన్స్ ఒకటి. దీని వుపయోగాలు ఒక్కొక్కటిగా ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి.

ప్రప్రథమంగా 1930 సం. లో, మనుషులవీర్యం, గర్భకోశపు కండరములమీద పని చెయ్యగలదని కర్స్‌రోక్ అనే శాస్త్రజ్ఞుడు కనుగొన్నాడు. 1935వ సం.లో "యూలర్" అనే శాస్త్రజ్ఞుడు, జీర్ణకోశంయొక్క కండరాలమీద, గర్భకోశపు కండరములమీద ముకుళింపచేసే శక్తి వున్నదని, రక్తనాళములను వ్యాకోచింపచేసే శక్తికూడా ఉందని కనిపెట్టాడు. వీర్యంలోని ఈ గుణాంకల పదార్థం 'ప్రొస్టేట్' అనే 'గ్రంథి' నుంచి వస్తుందని భావించి దీనికి 'ప్రాస్టా గ్లాన్‌డిన్స్' అని పేరుపెట్టారు.

అయితే దీని విషయంలో 1962వ సం. వరకూ ఎలాంటి చర్య తీసుకొనబడలేదు. ఆ సంవత్సరంలో "బెర్గ్‌స్ట్రోమ్" అనే అతను వీర్యంలోని ఈపదార్థం, ఆరు రకాలుగా కనుగొన్నాడు. ఈ ఆరు పదార్థములను ఇ, ఎఫ్. అనే రెండు భాగములలోకి విభజించారు. కొద్ది నెలల్కిందట కనుగొనబడిన కొత్త రకము లను ఏ. బి. లుగా గుర్తించారు.

# వైద్య విజ్ఞానంలో నూతన ఔషధం ...

వ్యాసకర్త డా. కె.వెంకటేశ్వరరావు వారంవారం పాఠకులకు సందేహాలు తీరుస్తున్నారు గనుక సుపరిచితులు. ఈ వ్యాసంలో ఆయన వైద్య శాస్త్ర పరిశోధకుల దృష్టిని— యీ దశాబ్దపు అత్యద్భుత ఔషధంగా రూపొంద గల ప్రొస్టా గ్లాన్‌డిన్స్ మీదకి మరల్చే ప్రయత్నం చేశారు.

రసాయనికంగా ఇలా విభజించక ముందు, "టిష్యూ ఎక్స్‌ట్రాక్ట్‌ల"లో వీటిని కనుగొన టం జరిగింది.

జీర్ణకోశంలో నుంచి తయారుచేసిన సారము, కుందేలు కనుపాపయొక్క సారము, ఋతుస్రావంలో నుంచి వేరు చెయబడిన పదార్థము – ఇవి అన్నీ గర్భాశయంపైన ముకుళింపు గలిగే శక్తి కలిగి వుండేవని నిర్ణయించారు. తర్వాత కాలంలో వీటన్నిటి కన్నా 'వీర్యం'లోనే ఇవి ఎక్కువగా వున్నట్లు కనుగొన్నారు.

ప్రొస్టా గ్లాన్‌డిన్, సిన్‌తెటేజ్ అనే ఎంజైము కొన్ని ముఖ్య కొవ్వు ఆమ్లములపై (ఫ్యాటి ఆసిడ్) పనిచేయుటంవల్ల ప్రొస్టాగ్లాన్ డిన్ తయారవుతుంది.

రావటానికి, ఋతు స్రావంలో ఉన్న ఈ పదార్థాలే కారణం అని కొందరి అభిప్రాయం.

## నరములపై వీటి చర్య :

నరముల ఉద్రేకానికి ఇవి కారణమని కొందరు, నరములు మందకొడిగా పనిచేయ టం, మత్తు కలిగించటం చేస్తాయని కొందరు అభిప్రాయ పడుతున్నారు.

### హృదయము—రక్తనాళములు

ఇ. ఏ. తెగలకు చెందిన ప్రొస్టాగ్లాన్ డిన్స్, బ్లడ్‌ప్రెషర్ తగ్గింపగలుగుతాయి. ఎఫ్ తెగకు చెందినవి రక్తపు పోటును అధికం చేస్తాయి. ఇ2 తెగకు చెందినవి మూత్రం ఎక్కువ విసర్జింప జేస్తాయి.

### హార్మోనులు

హార్మోనుల పనితనమును అవసరాన్నిబట్టి ఈ పదార్థములు నిర్ణయిస్తాయని ప్రస్తుతపు అంచనా.

## ఈ ప్రొస్టా గ్లాన్‌డిన్స్ వల్ల వుపయోగాలేమిటి ?

### *అనిచ్ఛా కండరములు*

ఈ కండరములు, (శరీరం లోపలి భాగాల లోను అవయవములలోను వుంటాయి) ముకుళింప చేయబడుతాయి. జీర్ణకోశంలో కాన్సర్ వున్నవారికి, ఆ భాగం నుంచి వీటి వుత్పత్తి ఎక్కువగా వుంటుంది.

### *జననేంద్రియములు—*

### *వాటికి సంబంధించిన భాగాలు*

స్త్రీల జననేంద్రియాలపై వీటి ప్రభా వం ఎక్కువ. ఓవరీస్ నుంచి గర్భసంచికి పోయే "ఫెలోపియన్ ట్యూబ్"ను వ్యాకోచింప చేయుటం, గర్భాశయమును ముకుళింప చేయుటం, వీటి ముఖ్యమైన పని. ఇలా జరగటం గర్భిణిస్త్రీలలో ఎక్కువగా కనబడుతుంది. కృత్రిమంగా ప్రసవం లేక అబార్షన్ కలిగించటానికి వీటిని ప్రస్తుతం ఉపయోగిస్తున్నారు.

స్త్రీ పురుషుల కలయిక తర్వాత స్త్రీ జననేంద్రియం నుంచి ఈ పదార్థములు, పురుషుల 'స్పెర్మ్' స్త్రీల జీవకణములతో కలవటానికి, స్త్రీల జననాంగాలను సిద్ధపరుస్తాయని శాస్త్రజ్ఞుల అంచనా. అయితే కృత్రిమంగా, వీటిని మందుల రూపంలో వాడినప్పుడు, ఈ కలయికకు అవరోధం కలిగిస్తాయి. స్త్రీలకు ఋతు సమయంలో నెప్పి

## ప్రొస్టాగ్లాన్‌డిన్స్ ఆస్పిరిన్

ప్రతి రోజూ కొన్ని లక్షల ఆస్పిరిన్ మాత్రలు వాడుకలో వున్నా ఇంతవరకు అవి ఎలా పని చేస్తాయో కనుగొనబడలేదు.

ప్రస్తుతం ఆస్పిరిన్ వాడినప్పుడు, ప్రొస్టా గ్లాన్‌డిన్స్ వుత్పత్తి తగ్గుతుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ప్రొస్టా గ్లాన్‌డిన్స్ వల్లనే నెప్పి మొదలయినవి కలుగుతాయనీ, ఆస్పిరిన్ దీని వుత్పత్తిని తగ్గించటం వల్ల లేక రసాయనికంగా వీటిలో మార్పు తేవటం వల్ల నెప్పితగ్గుతుందని ప్రస్తుత అభిప్రాయం అలాగే ప్రొస్టా గ్లాన్‌డిన్స్ యొక్క జ్వరం కలిగించే గుణాలకు కూడా ఆస్పిరిన్ అవరోధం కలిగిస్తుంది.

### ప్రొస్టాగ్లాన్‌డిన్స్—ఆస్త్మా

ఆస్త్మా వున్నవారు ఆస్పిరిన్ ఎక్కువగా వాడకూడదనేది వైద్యశాస్త్రం. అయితే ఆస్త్మా వున్నవారి వూపిరితిత్తులలో ఈ ప్రొస్టా గ్లాన్ డిన్స్ ఎక్కువగా వుంటాయి. ఆస్పిరిన్‌కి ప్రొస్టాగ్లాన్‌డిన్స్‌ని నిరోధించే శక్తి వున్నప్పుడు ఆస్పిరిన్ ఎందుకు వాడకూడదు?

పైన చెప్పిన విషయాలను పరిశీలిస్తే త్వరలో, ఈ ప్రొస్టాగ్లాన్‌డిన్స్—దాదాపు సర్వ రోగ నివారిణిగా లేక దీనియొక్క క్రియలను అరికట్టడంవల్ల—ఎన్నో రోగాలను రూపు మాపవచ్చని ఆశించవచ్చును. అయితే వీటి విషయంలో ఇంకా ఎంతో పునఃపరిశీలన అవసరం. ఎన్నో సాధారణ వ్యాధుల చికిత్సకు ఇవి వుపయోగ పడగలవని అభిప్రాయం గనుక, మనదేశంలోని శాస్త్రజ్ఞులు కూడా వీటి విషయంలో తగినంత కృషి చేయవలసిన అవసరం ఎంతైనా వున్నది.

## మీకు తెలుసా ?

ప్రముఖ హిందీ నటి రాఖీ ఒక ఆడపిల్లకు తల్లి అయింది, డిశంబరు పదవ తారీఖున దిలీప్‌కుమార్ డిశంబరు పదకొండవన, రాజ కపూర్ డిశంబరు 14న పుట్టారు.

డిశంబరు నెలలో ప్రముఖ హిందీ నటుడు ప్రాణ్ "సితారోం కీ రాత్" అనే గొప్ప ప్రదర్శనను గుడ్డి, కుంటి వారి సహాయార్థం ఏర్పాటు చేసి కొంత డబ్బు ప్రోగు చేశారు.

భారతీయ చిత్రాలను విదేశ భాషల్లో డబ్ చెయ్యడానికిగాను, ఒక ఫిల్మ్ ఫ్రీలో ఒక సంస్థను ప్రారంభిస్తారట

సత్యా ఎంటర్‌ప్రైసెస్ వారి చిత్రానికి "ఆడపిల్లల తండ్రి" అని పేరుపెట్టారు.

జెమినీవారి "కన్నవారి కలలు" ఈస్ట్‌మన్ కలర్ చిత్రం శోభన్‌బాబు జన్మదిన కానుకగా విడుదల చేశారు.

ప్రముఖ గాయకురాలు సుశీల ఒక పాటను అయిదు నిమిషాల్లో ఒకే రిహార్సలుతో పాడగలదు.

ఇటీవల దాశరథి, కొసరాజుగార్ల పాటలు ఎక్కువగా వినిపిస్తున్నాయి ఇది వాళ్ళసీజన్ అనుకొంటాను.

—శ్రీనివాస్

ఫ్యాక్టరీ బస్సులో నుంచి చిక్కడపల్లి స్టాపులో దిగి రెండు ఫర్లాంగులు నడిచాడు ఆనందరావు ఆగిపోయివున్న చేతి గడియారాన్ని చూసి ఒక్క క్షణం తానూ ఆగాడు ...




'కీ' ఇవ్వలేదేమోననుకొని మణికట్టునుండి వాచీ తీసి 'కుంజీ' యిచ్చాడు. 'ఈరాసామి హేర్ డ్రెస్సింగ్ సెలూను' లోపలికి చూసి టైం కలిపాడు. సెకన్ల ముల్లు కదల్లేదు. చెవిదగ్గర పెట్టుకొని చూస్తే శబ్దం రాలేదు. ఫిట్సువచ్చిన కుర్రాడిని ఊపినట్లుగా అటూ యిటూ ఊపాడు.

సత్యం డబ్బీని కొట్టినట్లుగా కిందాపైనా కొట్టి చూసాడు. ప్రయోజనం లేకపోయింది.

ఉస్సురంటూ యిల్లుచేరి మరోసారి వాచీని ఊపి చూసాడు. టిక్కు టిక్కుమంటూ వినిపించింది.

* * *

బయట చినుకులు పడుతున్నాయి. లోపల బాబు చిన్నగా ఏడుస్తున్నాడు.

చొక్కాను విప్పుతూ కిటికీగుండా చూస్తే కిరసనాయిలు డబ్బాలతో, కొంపలంటుకు పోయినట్టు అన్ని వయసుల ఆడా మగా బాధితుల్లా, పరుగెడుతున్నారు, విమానంలో నుంచి అతి విచిత్రంగా తిలకించే మంత్రిలా తాను—చూస్తున్నాడు. ఆనందరావు ఆలోచనకు తనలో తానే చిరునవ్వు నవ్వు కున్నాడు.

అసలి మూడేళ్ళనుండి కిరసనాయిలుతో అంతగా అవసరం లేకపోయింది. జానకి రెండోకాన్పుకు వెళ్ళినప్పుడు పేద ప్రజల కోసం బ్యాంకులను జాతీయం చేసిన ప్రభుత్వం లా 'పూర్ జానకి డార్లింగ్' కిరసనాయిల్ స్టవ్‌తో బాధపడుతున్నదని చూసి "గ్యాస్ సిలిండర్" తెచ్చాడు!

వణుక్కుంటూ ఇంటర్వ్యూకెళ్ళి అదృష్టవశాత్తూ అర్డరే పట్టుకొచ్చేసిన నిరుద్యోగిలా, భయపడుతూ వెళ్లిన బలహీన వ్యక్తి జానకి పండంటి కుఱ్ఱాడితో తిరిగొచ్చి గ్యాసు స్టవ్, సిలిండరూ చూసి దానికయిన ఖర్చువిని, "అన్ని డబ్బులు తగలెట్టారెందు కండీ ?"అని అపోజిషన్ పార్టీలా అమాంతం పైకి లేచింది. ఎంత సముదాయించినా విన లేదు. కార్మిక నాయకుడిలా కమ్మని కబుర్లు చెప్పాడు. జానకి ఒక్క మాటా వినకపోగా మూడుగంటలసేపు అరిచింది, గొణిగింది. అసహాయుడైన ఆనందరావు డ్రాయింగ్ కమ్ డైనింగ్ కమ్ డార్లింగ్ రూంలోకెళ్లి ఖాళీ కుర్చీలను మంచాన్నీ చూస్తూ కన్నీరు కూడా కార్చాడు, ఐక్యరాజ్య సమితిలో కన్నీరు కార్చిన కరాచీ అధికారిలా.

కులం చెడినా సుఖం దక్కినట్టు వాసు పోసు, ఖర్చు కాస్త ఎక్కువే అయినా సుఖమూ హాయి ఉన్నాయనిపించి, 'మిమ్మల్ని అనా డేమేమో అన్నాను. అదంతా మఱచిపోండి. కిరసనాయిలు దొరకని ఈ రోజుల్లో ఇది ఎంతో హాయిగా వుందండీ'అని జానకి అన్న ప్పుడు ఆనందరావు ఏదో మంత్రి పదవి దొరికినంత సంతోషించాడు.

ఆనందరావు జానకి మాటలు విని, ఇటలీలో బురద స్నానం చికిత్స పొందుతున్న ఆఫ్ఘ నిస్తాను రాజా, తన బావగారే తన సామ్రా జ్యాన్ని కైవసం చేసుకున్నాడని తెలిసి బురదలో కూరుకుపోయినట్టు, కుర్చీలో కుప్పలా కూలిపోయాడు.

జానకి చెప్పిన మాటల సారాంశం, రాంభాయమ్మ సపరివార సకుటుంబ సమే తంగా విచ్చేస్తున్నదని.

రాంభాయమ్మను తలుచుకుంటేనే ఆనంద రావుకు పళ్లేలన్నీ ఒక్కసారే గచ్చుమీద విసిరి కొట్టినట్టు, నెత్తిమీద నైజాం కాలంనాటి తుప్పుపట్టిన ఫ్యాను బరబరా తిరుగుతున్నట్టని పించింది. ఎలెక్షన్ల సంరంభంలోని లారీలు, జీపులు, కార్లు, తన బుర్రలోనే తిరుగు తున్నట్టు — విధాన సౌధాల్లో విచ్చలవిడిగా ఎగిరిపడే చెప్పులు, విజిటర్ల గాలరీల నుండి వెదజల్లబడే కరపత్రాలు, అవకతవకలుగా ప్రచురించబడిన పత్రికా సమాచారాలు, రాష్ట్ర విభజనల మీది విచారాలు, గర్భనిరోధక ప్రచారాలు...ఇంకా...ఇంకా... బుర్ర వేడెక్కి పోయింది.

రాంభాయమ్మ జానకి తరఫున దూరపు బంధువు. కాని ఆమెకు మాత్రం దగ్గరా దూరం అన్న తారతమ్యంలేదు! కొత్తా పాతా, మగా ఆడా, ముసలీ ముతకా భేదంలేదు. ఆమె నోరువిప్పిందంటే ఇంక ఆకాశవాణి అక్కరలేదు. ఏడాదిలో ఎప్పుడూ ఏదో ఒక టూరు చేస్తూనే వుండాలి. లేకపోతే ఆమెకు బోరు. ఆమె ఎక్కడ కాలు పెట్టిందో అక్కడ ఒక పెద్దహోరు! ఎప్పుడు కాలు కదిపినా రాంభాయమ్మతో ఇద్దరు ముగ్గురు పిల్లలుండాలి! రాంభాయమ్మ వస్తున్నదంటే, అదో పార్లమెంటు డెలిగేషను రాకగా భావించి ఆ బంధువులు తమ ఇంటికి ఎన్ని మార్కులు వేస్తుందో, ఇల్లు, పరిసరాలమీద ఎన్ని రిమార్కులు పాసు చేస్తుందోనని భయ పడతారు !!

రాంబాయమ్మకు తెలియని విషయమంటూ లేదు పాలకవర్గం యొక్క ప్రజ్ఞను గురించి ఎంత బాగా చెప్పగలదో ప్రజానీకంపడే బాధలని గూడ అంత బాగా చెప్పగలదు. తోటకూర నెలాపండాలి, ఎప్పి బాలింతకేం పెందివ్వాలి, పాపపుణ్యాలు, పుణ్యక్షేత్రాల మహిమలు, .. ఒకటేమిటి పులకేశి మహారాజు దగ్గరనుంచీ పులిహోరదాకా, అలనాడు ఐక్యరాజ్యసమితిలో కృష్ణమీనన్‌లా, గంటల తరబడి ప్రసంగించ గలదు. ఎటొచ్చీ అన్ని విషయాలు అక్షర క్రమంలో ఉండకపోటం లేదా ఒక దానికిం కొకటి సంబంధ సారూప్యాలు లేకపోవడంగాని జరుగొచ్చు.

ఒక్క మాటలో చెప్పాలంటే—ఆమె మెదడు ప్రతి పొరలో పొరలే విషయాలన్ని ఒక ఎత్తు, విజ్ఞాన సర్వస్వ (ఎన్ సైక్లో పీడియా)మంతా ఒక ఎత్తు.

"ఏమండీ ?"

అది జానకి గొంతు. ఆ కంఠంలో ఎంతో ఆదుర్దా ఉంది.

బహుశః రాంభాయమ్మ సైన్యం వస్తున్నదేమో!?

కిటికీనుంచి బయటికి చూసాడు.

రోడ్డుమీద ఎలాంటి సంచలనం లేదు.

ఆకాశంలో అందాకా విరిసిన మబ్బులు చెదరి పోతున్నాయి.

"గ్యాసు సిలిండర్ అయిపోయిందండీ."

అవిశ్వాస తీర్మానంలో అవతలికి గెంటి వేయబడ్డ ముఖ్యమంత్రిలా అయింది ఆనంద రావు పని.

"ఫోను చేసిం నెలకుగాని సిలిండరు రాకటంలేదని చెప్తున్నారండీ కాంతమ్మ గారు."

"అంగును చాలాకే, అదేమాట ప్రసాద్ కూడా మొన్న చెప్పాడు. అక్కడా ఇన్ ఫ్లుయెన్స్, లంచం ఉంటే తప్ప సిలిండర్ రాదని అందరూ అంటున్నారు. చేతెత్తాలన్నా కాలు కదపాలన్నా రెకమండేషన్లు, ఆమ్యామ్యాలు చ...చ..." విసుక్కున్నాడు ఆనందరావు.

"ఇవాళ్టికి సరిపోయేంత కిరోసిన్ మాత్రమే ఉందండి రేపటి వరకు ..."

"నువ్వువెళ్ళి తీసుకొనిరావే జానకీ. నాకు నీరసంగా ఉంది. అందులోను, ఆడ వాళ్ల క్యూ కాస్త చిన్నగా ఉంటుంది."

". .."

"ఫ్యాక్టరీలో ఎనిమిది గంటలు కాళ్ళూ చేతులు విరిగేలా పని చేసేసరికి ప్రాణాలు హరీ మంటున్నాయి ఇదేం జీవితమో ఏమిటో "

మంచంలో వెల్లకిలా పడుకుని, కళ్ళు మూసుకొని ఎం గేట్లో నుదురంతా గట్టిగా లటగా ఇంగా నాసాను

* * *

స్కూలుకెళ్ళిన బేబీ ఇంకా రాలేదు. ఏడుస్తున్న బాబు ఎప్పుడో నిద్రపోయాడు. పెళ్ళాల చాటున నిప్పులకల కిటకిటలు, జానకి గాజుల సన్న సన్నని గలగలలు తప్ప గదిలో వాతావరణం పొడిగానే వుంది.

బయట భూకంపం వచ్చినట్లుగా ధ్వని వినిపించింది. వెంటనే చంద్రమండలం నుంచి పసిఫిక్ మహాసముద్రంలోకి దూసుకొచ్చే అపోలో అంతరిక్ష నౌకలా రానేవచ్చింది రాంభాయమ్మ, చంకలో ఒక కుర్రాడు, కుడి చేతికి వ్రేలాడుతూ ఇంకొక కుర్రాడు, కొంగు పట్టుకొని నోట్లో వేలేసుకున్న ఒక అమ్మాయితో సహా—వెనక ఒక పాత సూటుకేసూ, కొత్త బుట్ట, ఒక బట్టల మూట.

ఏదో గొణుగుతున్న రిక్షావాడు రాంభాయమ్మ తెఱచిన నోరును చూసి కిమ్మనకుండా జారుకున్నాడు.

"రండి బామ్మగారూ రండి, అంతా కులాసేనా ?"

అడిగాడు ఆనందరావు (పేద రైతును అడిగే పెద్దదొర ఆప్యాయంతో.)

"ఆఁ! ఏం కులాసో ఏవిటోరా బాబూ... జానకీ ఒక గ్లాసుడు నీళ్లందుకోమ్మా." కుర్చీలో కూలబడింది. నోరులేని కుర్చీ కొద్ది క్షణాలు గోలపెట్టింది.

నోరున్న ముగ్గురు పిల్లలు జానకి ఆనంద రావులకేసి అదోలా చూసారు.

అప్పుడే అపోలో నుండి దిగివచ్చిన అంతరిక్ష యాత్రికుల్లా వాళ్లుముగ్గురు—అమెరికా అధ్యక్షుడు నిక్సన్‌లా చిరునవ్వుతో తాను, ఆనందరావు. ప్రక్కనే జాసెఫ్ కెనెడీ ఆత్మలా జానకి—నిర్వికారపు చూపులతో.

"ఏమిట్రా ? అలా కొయ్యబారి




హయ్యారు, కౌంగిల్లా ఏపిస్తే ఆసాగిన వాడలు ? కూడు తినటం లేదా యేం జానకీ ? ."

ఆనందరావు యింటివెనక్కి వెళ్లాడు.

డూళ్లో ఎద్దులబండి ఎంత కష్టపడితే దొరికిందీ, రైలు ప్రయాణం ఎలాసాగిందీ, రిక్షాబేరం ఎంతకు కుదిరిందీ — ఒక డాక్యుమెంటరీ సినిమా చూపించింది జానకికి అరగంటసేపు.

స్నానం చేసివచ్చిన ఆనందరావు జానకి కేసిచూసి కళ్లతోనే సానుభూతి తెలిపాడు.

ఆసుపత్రిలో అయిదు రోజులుండి తిరిగొచ్చిన అసెంబ్లీ మెంబరు, అంతలోనే మారిన ముఖ్యమంత్రిని చూసి అవాక్కయినట్టు, కాన్వెంటు నుండి వచ్చిన బేబీ బిత్తరపోయింది రాంభాయమ్మా అండ్ కంపెనీని చూసి.

"అయ్యో నామతి మండ, కబుర్లలోపడి పిల్లల్నే మఱచిపోయ్యానే తల్లీ. పిల్లలూ రండర్రా"

బుట్టలోంచి పల్లపడిన నాలుగు అరటి పండ్లు తీసింది అవేవో చంద్ర శిలలన్నట్టు.

వంటగదిలోకెళ్లి సామగ్రిని తనిఖీచేసింది. సిలిండర్ వ్యవహారం తెలుసుకొంది. ప్రస్తుత పరిస్థితి గ్రహించింది రాంభాయమ్మ.

ఆనందరావు కిరసనాయిలు డబ్బాను చేతిలోకి తీసుకున్నాడు. పది కిలోల బియ్యం, ఐదు కిలోల గోధుమలు కూడ తీసుకురమ్మని డబ్బులు, సంచులు యిచ్చింది జానకి.

"నేను మాత్రం యింట్లో ఊరికే కూచొనేం చెయ్యాలిరా ఆనందం ? నీకూడా వస్తాను పద" అంటూ లేచింది రాంభాయమ్మ మోకాళ్ళమీద చేతులాన్చి.

"ఎందుకులే బామ్మగారూ ? మీరూ యింట్లోనే వుండండి."

"ఇందులో ఏముందిలే అబ్బాయి. ఆ కొట్టెక్కడో చూపించు. నేనే వెళ్లి తీసుకొస్తాను. అమ్మాయి చెప్తోంది గదా బియ్యం, గోధుమలు వేరే షాపులో దొరుకుతాయిటగా."

"రాక రాక ఇన్నాళ్లకు చుట్టం చూపుగా వచ్చారు. మీకా కష్టమెందుకు బామ్మగారూ."

"ఇదేం కష్టంరా ఆనందం! ఇంతకన్నా పెద్ద పెద్ద కష్టాల నెదుర్కొన్నాం. ఇంతకన్నా మండే కరువుల్ని చూసాం. బరువుల్ని మోసాంరా బాబు" అంటూ ఆనందరావు చేతిలోనుంచి డబ్బా తీసుకొంది.

"నేనొస్తాను తాతమ్మా" అన్నాడు పెద్దవాడు సతీష్చంద్ర.

"నేను అత్త." అంటూ ఎగిరాడు చిన్నవాడు సంతోషచక్రవర్తి.

"మీరెందుకు. ఇక్కడే ఉండండి. పిస్తు ఉంది. అదిగో ఆడుకోవటానికి బేబి, బాబిగాడూ వున్నారు. వుండండ్రా ఇక్కడే."

మారాం చేసాడు సతీష్చంద్ర. రాగం అందుకున్నాడు సంతోష్. అమ్మాయి లావణ్య ఏదో గొణుగుతున్నది.

అందరినీ మరోసారి గద్దించి "ఆనందం పదరా బాబూ పద" అంటూ అడుగువేసిందో లేదో ఆనంద్రావాలయంలో నిలయవిద్వాంసుల వాద్య గోష్ఠి ప్రారంభమయ్యింది.

అబ్బబ్బ ఏం పిల్లల్రా నాయనా చిచింద్రీలు...ష్... అంటూ ఆనందరావుతో

హైదరాబాదునగరం నడిరోడ్డుకేసి దారి తీసింది, రాంభాయమ్మ.

ఎంతసేపు ఏడ్చిందో పాపం! చేతిలో బిస్కెట్లు, చెంపలమీద కన్నీటి చారలతో సాధనాహేర్ కట్‌తో, తననాన్నగారి వెంట బయటికి వచ్చింది పాప సెలూన్ నుంచి. వీరాస్వామి వెంట్రుకలను మూలకుపోసి గుడ్డ దులుపుతూ ఆనందరావుకేసి చూసి చిరునవ్వు నవ్వాడు. సెలూను లోపలికి తొంగిచూసిన ఆనందరావు వెంటనే తన రిస్టువాచీ కేసి చూసుకొన్నాడు. గోడ గడియారం పెండ్యులం ఆగివుంది. తన వాచీ నడుస్తూనే వుంది.

వీరాస్వామితో ఆ విషయమే అడిగాడు.

“అది ఆగిపోయి వారం రోజులయింది రావుగారూ. రిపేరు కివ్వాలి” అన్న వీరాస్వామి మాటలకు ఆనందరావు తెరిచిన నోరు




## జెండా ఊంఛా ...

అలాగే గోల్కొండ దర్వాజాలా ఉండి పోయింది కొన్నిక్షణాలు.

కిర్లీబడ్డి నారాయణ, బిచ్చగాణ్ణి కసురుతున్నాడు

పెండిమఠ ప్రక్క స్లేటును పటపట లాడించి, దాని నోరు మీద బొల్పుతో కటకట కొట్టుతున్న పీర్‌మహ్మద్ ముఖమంతా పెండితోనిండి నవ్వుతున్నాడో, ఏడుస్తున్నాడో ఏమీ తెలియటం లేదు.

కిరసనాయిలు ఏజెంటు పచ్చిపులుసు కిష్టయ్య కొట్టుముందు తిరుమల కొండ మీది క్యూ కన్నా పొడుగ్గా వుందిక్యూ.

పరిస్థితుల్ని కాసేపు పరిశీలించి కొన్ని యక్షప్రశ్నలు వేసి వెళ్ళి ఆడవాళ్ల క్యూలో డబ్బాను పెట్టి ప్రక్కన నిల్చుంది రాంభాయమ్మ.

రేషనుషాపుకు వెళ్లటానికని కొన్ని అడుగులు వేసాడు. విశ్వనాథం ఎదురయ్యాడు, చేతిలో చిరిగిన రెండు మూడు సంచులు, సొట్టలుపోయిన కిరసనాయిలు డబ్బా. డమరుక త్రిశూలాదులతో శివుణ్ణి, గదాచక్రాదులతో విష్ణుమూర్తినీ రవివర్మ చిత్రించివట్లే ఇరవయ్యో శతాబ్దపు సామాన్య భారతీయుని

బొమ్మ వేయాలంటే విశ్వనాథాన్ని ఊహించుకుంటే చాలు.

విశ్వనాథంకు తెలివి వుంది. బి. ఏ. లో యూనివర్శిటీ సెకండు ర్యాంకులో పాసయిన సర్టిఫికెట్లు వుంది. పై చదువులకు వెళ్ల లేకపోయాడు. కనీసం మంచి ఉద్యోగమైనా యివ్వలేదీ నవనాగరిక సంఘం.

మూడుపదుల వయసు విశ్వనాథంది. ఆరు పదుల్లో పడినట్లు చేసాయి ఆయన ఆకార వికారాలు. తెల్లగా నెరిసిన జుట్టు, సోడా బుడ్డి కళ్లజోడు, పీక్కుపోయిన బిడ్డ ముఖం, పొడుచుకొచ్చిన 'అడమ్స్ ఆపిల్', మాసిపోయిన చవకరకం టెరీకాటన్ చొక్కా, శాతవాహనుల కాలంనాడు ఇస్త్రీచేసిన ప్యాంటూ, అరిగి విరిగి సగమైన చెప్పులు — దేశ సౌభాగ్యాన్ని చెప్పకనే చెప్తున్నాయి.

"ఆఫీసునుండి తొందరగానే వచ్చినట్టున్నారే ?"

"ఇంక ఆఫీసేమిటండీ నాకొండ. ఆఫీసులో రెండు మూడు గంటలు చేస్తే మహా ఎక్కువ. తక్కిన జీవితమంతా ఈ క్యూలల్లో గడిచిపోతున్నది..."

"మాబాగా సెలవిచ్చారండి" కారాకిళ్లీతో గారబట్టిన ముప్ఫై ఒక్క పళ్లనూ బయట పెట్టి సకిలించాడు క్యూలో చివర నుంచున్న ఒక ఆసామీ.

కారాకిళ్లీ నవ్వును చూసి నాలుగుమీటర్లు నడిచి మరో అయిదు నిమిషాలు అదీ యిదీ మాట్లాడుకొని ఆనందరావు ముందుకు విశ్వనాథం వెనక్కి వెళ్లారు.

రేషను షాపు క్యూలో ఆనందరావు ప్రవేశం, ట్రాన్సిస్టరు రేడియోలో మీనాక్షి పొన్నదురై నిష్క్రమణ ఒక్కసారే జరిగినయి.

అధికధరలు, ఆంధ్రప్రదేశ్ విభజన, ఇసుకలో కలిసిన బియ్యం ఇత్యాది మాటలు గ్రామఫోను రికార్డులా స్టీరియోఫోనిక్ ధ్వనిలో ఎక్కడ చూసినా పాతమాటలే, పాత పాటలే.

నవ్వులు, ఆవేదనలు, నిరాశా నిస్పృహలు, నిట్టూర్పులు, అక్బరు త్రవ్వించిన బావుల్లోంచి, వేయించిన రోడ్లమీద నాటించిన చెట్లనీడల క్రిందనుంచి వస్తున్నట్లుగా ఊహించాడు ఆనందరావు.

అతికష్టంమీద బియ్యం ఒక సంచిలో, గోధుమలు ఇంకో సంచీలో పోయించుకొని జైలునుండి విడుదలైన ఒకనిర్దోషిలాబయటకి వచ్చి టైం చూసుకున్నాడు. '...ప్రాంతీయ వార్తలు చదువుతున్నది తిరుమల ...' అని వినిపించింది ట్రాన్సిస్టరులో.

పచ్చిపులుసు కిష్టయ్యకొట్టు ముందుకు వచ్చాడు.

రాంభాయమ్మ సీనియారిటీ లిస్టులో రెండో—మూడో నంబరుంది.

'బతికిపోయాంరా బాబూ' అనుకున్నాడు ఆనందరావు.

అంతలోనే ఒక ఎర్రకోకవచ్చి రాంభాయమ్మ ముందు నిల్చుంది.

ప్రక్కకు జరగమంది రాంభాయమ్మ. ఎర్రకోక తన డబ్బాను అప్పుడెప్పుడో పెట్టి వెళ్లిందని చెప్పింది. అదే అక్కడివాళ్లు విన్న చివరిమాట. ఆ తర్వాత రాంభాయమ్మ రంకెలు, ఎర్రకోక పెడబొబ్బలు.

కిరసనాయిలు అమ్మబడును అని ప్రకటించిన కార్యక్రమానికి బదులు కాంబోడియా యుద్ధం ప్రారంభమైంది.

పచ్చిపులుసు కిష్టయ్య, ఆనందరావు మరో పదిమంది విశ్వప్రయత్నంతో రాంభాయమ్మనూ ఎర్రకోకనూ విడదీసారు. వియత్నాం యుద్ధం ముగిసినప్పుడు కూడా అంత సంబరపడలేదు అక్కడి పురజనులు.

ఇల్లుచేరేసరికి '...బీద ప్రజలను ఉద్ధరించటమే మన పార్టీ ఏకైక లక్ష్యం అని అన్నారాయన...'అని చెప్తోంది రేడియో.

ఆ పార్టీకి ఏంపోయేకాలమొచ్చిందో ఏమో? ఆ అన్నాయనకు వచ్చే ఎలెక్షన్లలో ఏ ధనికులు బీదవాళ్ళను, కొని ఓట్లేయిస్తారో



"ఒక్కోమారు నే నెలా ఇంతలావయ్యానా అని ఆశ్చర్య మేస్తుందోసె"
"నాకుమాత్రం ఏడుపొస్తుంది. ఏం పాపం చేసిందా అని"

ఏమోపాపం ... అనుకున్నాడు ఆనందరావు. వాళ్లెక్కడపోతే ఏంగాని ఈ రాంభాయమ్మ ఎప్పుడు వెళ్తుందో భగవంతుడా అని వాపురుమన్నాడు.

* * *

ఉదయం ఆనందరావు కాఫీ తీసుకుంటున్నాడు. ఇంట్లో రాంభాయమ్మ ఏదో చెప్తున్నది. పబ్లిక్ కొళాయి దగ్గర పదిసిగలు కొట్లాడుకొని పారబోసిన నీళ్లకన్నా పట్టుకొన్న నీళ్లు తక్కువన్నట్లుగా పిల్లలగోలలో అక్కడక్కడా రాంభాయమ్మ మాటలు తన చెవుల్లోపడుతున్నాయి.

"...అదేనే మీ బాబాయి వాసుదేవంకు జ్వరంట పదిరోజుల్నుంచి...పిప్పిర్మెంటు... పడిశం...పిల్లలకి నీళ్ల విరోచనాలు..."

'ఆనందరావుగారూ... ఆనందరావుగారూ' పిలుస్తూ లోపలికి వచ్చాడు రామశాస్త్రి. ఏవిటి అన్నట్లు చూసాడు ఆనందరావు.

"కాస్త అర్జంటు పని తగిలింది... ఏమైనా కొంచెం సర్దితే" నసిగాడు. ఆనందరావేమీ మాట్లాడలేదు.

"మా యింట్లో ప్రస్తుతం రాష్ట్రపతి పరిపాలన. ముఖ్యమంత్రిగారు మూడురోజుల దాకా మూలా నక్షత్రంకేసి చూస్తూ వుండాలి. ఇదే ఛాన్సు మరి, ఏవైనా మంచి మంచి వంటకాలు అవీ చేసుకొని తినాలంటే. మళ్లీ మంత్రిగారు పరిపాలనను తమ చేతిలోకి తీసుకొన్నారంటె అన్నీ రేషను, కంట్రోల్సు కమామీషు. దానికి పిల్లలతో ఇన్‌ఫ్లుయెన్సు చేయించాలి, వాళ్లకు లంచాలు తినిపించాలి మనమో ముద్ద ఎక్కువ తినాలనుకుంటే... ఒక్క పది..."

రామశాస్త్రి బ్రాహ్మణుడు. మహా బీదవాడు. చదివేప్పుడు ఏ స్కాలరు షిప్పు, సహాయమూ దొరకలేదు ప్రభుత్వం నుంచి. ఉద్యోగం దగ్గరా ఏ ప్రిఫరెన్సూలేదు ఎందుకంటే తాను షెడ్యూలు జాతికి చెందక పోవటమే. ఫార్వర్డ్‌లో నంబరు ఒకటి కులం !

"చూడండి శాస్త్రిగారూ మా యిల్లు యిప్పుడొక ధర్మసత్రం, థర్డ్‌క్లాస్ కంపార్ట్‌మెంటులా క్రిక్కిరిసి ఉంది. భారతదేశపు జనాభాలా అరుస్తున్నారు. వినండి లోపల గోల .."

"పోనివ్వండి. మరి ఏం చేస్తాం పదిలో సగమైనా..."

"నన్ను ఇబ్బంది పెట్టేస్తున్నారు."

"కాస్త ట్రై చెయ్యండి. లేకపోతే నేనే ఇంకెక్కడైనా ప్రయత్నం...ఆఁ! ఇదెక్కడి పుస్తకమండోయ్, కొత్తగా ఉంది. "లేడి చంపిన పులి నెత్తురు" 'కవితా సంకలనం', బాగుందాండీ ?"

"ఆ ఏం బాగుండటమో ఏమో. ఎవ్వరు రాసినా అదేకథ. వస్తువులు దొరకటం లేదని, కంట్రోల్లు, రేషన్లు, కరప్షను వగైరా వగైరా వగైరా పూర్వకవుల కవిత్వం వేరు శాస్త్రిగారూ ... "

"అలా అనకండి. కాలాన్నిబట్టి కవిత్వం కవితా వస్తువులు మారాలి మరి అంతెందుకు అలనాటి యాజ్ఞవల్క్య వ్యాసవాల్మీకి వన్న యాదులు యిప్పుడు వుంటే కిరసిన్ పాఖ్యానము, సిమెంటాకాండ, ఇనుపస్కంధం, రవ్వోదంతం శర్కరాశ్వాసాలతో, పూర్వోత్తర రామాయణాలు, ఆంధ్ర మహాబియ్యం, తైల వాల్మోపనిషత్తు రాసి పారేసేవాళ్ళు కారంటారా ?... ఆఁ అన్నట్టు వంకాయల వెంకటసుబ్బయ్యను అరెస్టు చేసారట"

"ఏం? ఎందుకు ? ఎప్పుడు? చాలా గొప్ప మనిషి..."

"ఇది మరీ బాగుంది. ఆంధ్ర ప్రదేశ్ లాటరీలు ఎప్పుడు కట్టేసారు అని అడిగి నట్టుంది.వెరీవెరీ బాక్‌వర్డ్ ఆనంద్రావుగారూ. వాటిల్లో ఆయనకూ మంత్రిగారికి తేడా లొచ్చాయట. అరెస్టుచేయించి పారేసారు."

"ఏమండీ శాస్త్రులుగారూ ఇవ్వాళ దుర్ముహూర్తం ఎప్పటిదాకా ఉందండీ" అంటూ వచ్చింది లోపల్నించి రాంభాయమ్మ

గుడ్లు తేలేసాడు రామశాస్త్రి. తిధులు, వార నక్షత్రాలు ఏవీ తెలియవు రామశాస్త్రికి. వాటిని గురించి పట్టించుకోలేదు. రాంభా యమ్మగారడిగే ప్రశ్న ఇంకా పెద్దది.

'నా బ్రదుకే ఒక దుర్ముహూర్తంలో నడిచి పోతున్నది. అది ఎప్పటిదాకా ? అంటే నేను చచ్చేదాకా' అనుకున్నాడు రామశాస్త్రి.

లోపలి కెళ్ళిన రాంభాయమ్మ మాటలు వినవస్తున్నాయి.

"ఏం చదువులో ఏవిటో ? చదవేస్తే ఉన్నమతి పోయినట్టు... శాస్త్రులట, శాస్త్రులు... చిన్న ప్రశ్న...ఇస్త్రీచేసిన తెల్ల పంచెలా మొఖం పెట్టాడు. పేరు గొప్ప... ఊరుదిబ్బ..."

"శాస్త్రిగారూ క్షమించాలి, పద పద బయటి కెళ్దాం"

# జెండా ఊంఛా

శాస్త్రితో ఆనందరావు బయటికినడిచాడు

'రాంభాయమ్మా! రాంభాయమ్మా! నన్ను రాచి రంపాన పెట్టుతున్నావు తల్లీ!' అను కున్నాడు, ఆక్రోశించాడు ఆనందరావు.

* * *

సాయంకాలం సర్వోత్తమరావు వచ్చాడు అతని తండ్రి కొద్దోగొప్పో ఉన్నవాడే-కాని మెడిసిన్‌లో సీటు దొరికేలా లేదని షెడ్యూలు కులం సర్టిఫికేటుతో సీటు సంపాయించారు. ఒకటి రెండేళ్లలో డాక్టరు అయిపోతాడు. ఆనందరావుతో రెండేళ్ళనుంచి పరిచయం.

అతని విరియబోసిన విశ్వామిత్రుడిజుట్టు, హ్యూన్‌త్సాంగ్ మీసాలు, ఫాహియాన్ గడ్డం, పైన కాండిన్స్కీ పికాసో వర్ణచిత్రాలతో కూడిన మాస్కో గంటలాంటి షర్టు, క్రింద




బాబిలోనియన్ హాంగింగ్ గార్డెన్స్‌లా అడుగ్గం టలు (బెల్‌బాటమ్స్).

తలుపు దగ్గర నిల్చుని "ఆనందరావు గారూ" అని పిలిచాడు.

బయటికివచ్చిన రాంభాయమ్మ సర్వోత్తమ రావునుచూసి కాసేపు విస్తుపోయి, "ఏవిట్రా నాయినా ఏం కావాలి. పగటి వేషం మా బాగా కుదిరిందిగానీ దుక్కలాగున్నావు. ఎక్కడైనా పని చేసుకొని బ్రతికితే. ఇలా ఇంటింటికి తిరగడం ఎందుకు ?"

అప్పుడే ముఖం కడుక్కుని గదిలోనికొచ్చిన ఆనందరావు రాంభాయమ్మ ఎవరి నా మాట లంటున్నదో చూసి అవాక్కయిపోయాడు.

"బామ్మగారూ మీరు లోపలికెళ్ళండి" అరవాలనుకొని మెల్లగానే అన్నాను.

"క్షమించాలి రావుగారూ..."

"ఇందులో మీ తప్పుగాని మీ బామ్మ తప్పు గానీ లేదు ఆనందరావుగారూ మనతరం మీ బామ్మతరానికీ మధ్యనున్న అంతరం... సరే వస్తారా, సినిమాకు వెళ్దాం."

"సారీ, రాలేనండి నా మనసేం బాగోలేదు. మరెప్పుడైనా వెళ్దాం"

"ఫరవాలేదు వస్తాను" సర్వోత్తమరావు నిష్క్రమించాడు.

'రాంభాయమ్మా ! రాంభాయమ్మా !' ఎలుగెత్తి అరిచాడు ఆనందరావు—లోలోపల.

బయట 'టెలిగ్రాం" అని వినిపించింది.

జానకి, రాంభాయమ్మ గదిలోకి వచ్చారు. వాళ్ళ ముఖాల్లో ఆత్రత ఉంది. ఆందోళన ఉంది.

'వాసుదేవరావు సీరియస్ స్టార్ట్ ఇమిడి యట్లీ' అని ఉంది.

రాంభాయమ్మ రోదన ప్రారంభించింది. జానకి కళ్లలో నీళ్లు చిమ్మినయి.

"అబ్బబ్బ సీరియస్ అనగానే చచ్చినంత పనిచేస్తున్నారు ఊరుకోండి. బామ్మగారూ ప్రయాణానికి సిద్ధంకండి ఇంకో అరగంటలో రైలు ఉంది. అదిపోతే మళ్లీ రేపటిదాకా లేదు. తొందరగా తెమలండి."

"మరి మీరు రావటంలేదురా బాబూ ఆనందం."

"మేమూ రావాలనుకుంటున్నాం. కాని ఇంకా బేబీ స్కూలునుంచి రాలేదు. దానికోసం చూస్తే చాలా సేపవుతుంది. మీరు యివ్వాళ బయలుదేరండి. మేం రేపు వస్తాము. లేదంటే రేపే అందరం కలిసిపోదాం."

"అమ్మో నేనొక్క క్షణం ఇక్కడ ఉండనురా బాబూ. పద పద. మీరు రేపు రండి." అంటూ లేచింది రాంభాయమ్మ.

* * *

మరునాడు పదిహేనో తేదీ ఆగస్టు.

స్వతంత్ర భారతిలో స్వేచ్ఛావాయువులు వీచే రోజు.

కొద్ది దూరంలోనే ఉన్న మాధ్యమిక పాఠ శాలలో జండా వందనం కార్యక్రమానికి సన్నాహాలు జరుగుతున్నాయి. ఆనందరావుకు ఆ నాడు రెండో షిప్టు. కర్మాగారాల్లో, కారాగారాల్లో పడే కష్టాలు దాదాపు ఒక్కలాగే ఉంటాయి. అందుకే కార్మికులకు ఖైదీలకు జాతీయ సెలవు దినాలనుగాని, పండుగలనుగాని

(44వ పేజీ చూడండి)

# రామనాథన్ క్రిష్ణన్ కి ప్రియమైన కాఫీ:

# నెస్‌కాఫె!

"ఉత్తేజ కల్పనకు
దక్షిణాది కాఫీ
గింజలతో
తయారయిన
కాఫీకి దీటులేదు.
నా కాఫీ మెచ్చేది...
నెస్‌కాఫే."



అతనికి తెలుసు కాఫీకి అలవడినవారికి తెలిసినట్టు. ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫె విశిష్టమది. దాని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారది అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




## నెస్‌కాఫె

నెస్‌కాఫె మిక్కిలి ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL-90(2) 233 TEL




(గత సంచిక తరువాయి)

"మా రాధమ్మ పెళ్ళి చేసేద్దా మనుకుంటున్నానే పద్మా..." అన్నాడు పద్మక్కతో.

రాధలేచి, పిట్టగోడదగ్గరకు వెళ్ళి రోడ్డు వైపు చూస్తూ నిలబడింది. బాలరాజు మాత్రం ఆసక్తితో వింటూ కూర్చున్నాడు.

"దానికి అప్పుడే పెళ్ళేమిట్రా?... దానికింకా పదహారేకద..." అన్నది పద్మక్క.

"మా అమ్మ దానిపెళ్ళికోసం కలవరించేస్తోందే..."

పద్మక్క కొద్దిక్షణాలు ఆలోచించి, అన్నది.

"దానికేంరా పుత్తడి బొమ్మ...సుగుణాల రాశి...దాన్ని చేసుకునే వాడెవడోకాని అదృష్టవంతుడు..."

"దానిపేర పదెకరాలు రాశాను...రొఖ్ఖం పదివేల వరకూ ఇద్దామనుకుంటున్నాను... పై సంబంధానికి పోడానికి జంకుగా ఉందే .."

"మన బంధువుల్లో ఎవరైనా అబ్బాయి పెళ్ళికున్నాడా?..."

"ఎవరివరకో ఎందుకమ్మా... మన బాలరాజుకి. చేసుకో కూడదూ... వాళ్ళిద్దరి ఈడూ జోడూ బావుంటుంది. ."

బాలరాజుకి పెళ్ళనగానే సిగ్గు ముంచుకొచ్చింది కాబోలు, చివాలున లేచి పిట్టగోడ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"పెళ్ళనగానే అల్లుడికి సిగ్గు ముంచుకొచ్చింది ."అన్నాడు వెంకట్రాజు గట్టిగా నవ్వేస్తూ.

"భలే వాడివిరా వెంకటం...బాలుగాడికి పెళ్ళా...వాడి వయసెంత?... ఇంకా బొడ్డూడని పసివెధవ వాడు..."

"అదేమిటే. వాడికి ఇరవయ్యేళ్ళులేవూ? ఇంకా పసివాడేమిటి?... వాడి వయసుకి, నాకు మా రాధమ్మ పుట్టేసింది !..."

"అప్పటి రోజులు వేరురా వెంకటం... బాలుగాడికి చదువింకా పూర్తి కాలేదు... వాడిపొట్ట వాడే పోషించుకోలేడు ... వాడికి అప్పుడే పెళ్ళేమిట్రా?..."

"పెళ్ళి ఇప్పుడే చేసేద్దామనడంలేదు... ప్రస్తుతం మనం అవుననుకుంటే పెళ్ళి వాడి చదువయ్యాకే చెయ్యొచ్చు ... నాలుగేళ్ళు ఎంతలో గడుస్తాయి చెప్పు ...మారాధమ్మని కూడా 'బి. ఏ' చదివిస్తాను..."

పద్మక్క దీర్ఘంగా నిట్టూర్చింది.

"నాలుగేళ్ళ తర్వాత మాట ఏం చెప్పగలంరా.. నాలుగేళ్ళ తర్వాత వాడిమనసు ఎలా ఉంటుందో...నువ్వు వాడికోసం దానికిపెళ్ళి చెయ్యకుండా ఉంచావనుకో... నాలుగేళ్ళ తర్వాత వాడు చేసుకోనంటే? అప్పుడు మన బంధుత్వాలు చెడవూ?..."

వెంకట్రాజు కొద్దిసేపు మాట్లాడలేదు. చివరకు నిట్టూర్చి అన్నాడు :

"సరే నీ ఇష్టం పద్మా ... మన బంధుత్వాలు మరింత దగ్గరవుతాయనుకున్నాను.."

బాలరాజు విసవిసా నడుస్తూ క్రిందకు దిగిపోయాడు. నేను కూడా కాస్సేపు తిరిగి వద్దామని బయలుదేరాను. వాడూ నాకూడా వచ్చాడు. మా మూలుగానే కాలేజీ ఎదురుగాఉన్న తూముమీద చతికిలబడ్డాం. నేను సిగరెట్టు ముట్టించుకున్నాను.

" మా అమ్మకి మతిలేదు మామయ్యా "

"తప్పురా బాలూ ... పెద్దవాళ్ళని అలా అంటే కళ్ళు పోతాయట ... "

"కాకపోతే మరేమిటి మామయ్యా ... నేను పసివెధవనా ... బొడ్డూడని పసివెధవనా ? ... నువ్వేచెప్పు ... " బాలరాజు ఉక్రోషంతో అన్నాడు.

"అది సహజంరా బాలూ ... నాకు ముప్ఫయ్యేళ్ళు వస్తున్నాయా, ఓ బిడ్డకి తండ్రినా, మా అమ్మ నన్ను 'పసివెధవ'నే అంటుంది ... తల్లికి బిడ్డల వయసు తెలియదురా ... ఆ కళ్ళకి తన పిల్లలు పసివాళ్ళగానే కన్పిస్తారు ... "

"ఆ సంగతి అలావుంచు మామయ్యా... వెంకట్రాజు మామయ్య నా కోసం రాధకి పెళ్ళి చేయకుండా అట్టేపెడతానన్నాడుకద... అవునంటే ఏంపోతుంది చెప్పు ... వెంటనే కాదని చెప్పేయడమెందుకు ? ... "

"మీ అమ్మ చెప్పింది కూడా సబబుగానే ఉందిరా బాలూ ... ఆ రాధ ఇప్పుడు నీకు నచ్చింది ... నాలుగేళ్ళ కాలం ఆడపిల్లకి తక్కువదేంకాదు ... ఇప్పుడు పూలరెమ్మలా ఉన్న రాధ నాలుగేళ్ళ తర్వాత పిప్పళ్ళబస్తాలా తయారవచ్చు ... అప్పుడు నీ కళ్ళకు రాధ నచ్చకనూపోవచ్చు, పెళ్ళి చేసుకోననూ వచ్చు .. నీకోసం పెళ్ళి చెయ్యకుండా రాధని ఉంచిన వెంకట్రాజు ఏమవాలి ? ...

నాలుగేళ్లపాటు నిన్ను కాబోయే భర్తగా ఊహించుకొని, కలలు కన్న రాధ ఏమవ్వాలి ? ... ''

''ఎవరూ ఏమీ కానక్కర్లేదు ... నాలుగేళ్లుకాదు; పదేళ్ల తర్వాతైనా సరే రాధ ఎలాఉన్నా చేసుకుంటానని హామీ ఇస్తున్నాను ... ''

నేనేం మాట్లాడలేదు. జీవితమంటే ఏమిటో తెలియని వాడి మాటలు ఎలా నమ్మగలను ? జీవితాన్ని అతి తేలిగ్గా తీసుకునేవాడు, అన్నమాట నిలబెట్టుకుంటాడనేమిటి ? వాడిలో పసితనమింకా పోలేదు. నాలుగేళ్లతర్వాత రాధని చేసుకోడానికి ఇష్టపడక, 'తెలిసీ తెలియని వయసులో ఏదోఅన్నా న'ని అంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు ?

'రాధంటే నాకు చాలా ఇష్టం మామయ్యా...మనసా, వాచా గాఢంగా ప్రేమించాను...రాధకి అందమే కాదు, ఆత్మ సౌందర్యం కూడా ఉంది...మా మనసులు కలిశాయి, మా అభిరుచులు కలిశాయి... అలాంటిది రాధకి ద్రోహం చెయ్యగలవా ? నా చదువు పూర్తి కాగానే రాధ ఎలా ఉన్నా చేసుకుంటాను మామయ్యా...''

నేనేం మాట్లాడక పోవడంతో, నా వైపు చూసి వేడికోలు స్వరంతో అన్నాడు.

''నీ మాటకి అమ్మ చాలా విలువ నిస్తుంది మామయ్యా...ఎలాగైనా అమ్మచేత ''సరే'' నన్పించు మామయ్యా ..నేనూ, రాధా నీకు జీవితాంతమూ రుణపడి ఉంటాం మామయ్యా...''

''మరి మీ నాన్న...''

''నాన్నగారు నాకు ఎదురు చెప్పరు...''

''సరే ప్రయత్నిస్తాను...''

పద్మక్క సరేనంటుందన్న ఆశ నాకు లేదు !

ఆ మరునాడు ఉదయం, గదిలో పద్మక్క ఒక్కర్తే ఉన్న సమయం చూసి వెళ్లాను. తను బట్టలు సర్దుతోంది, నన్ను చూసి.

''ఏం కావాల్రా ప్రకాశం ?....'' అన్నది.

''అబ్బే ఏం లేదక్కా .... తోచక వచ్చాను....''

''అలా మంచంమీద కూర్చో....''

కొంతసేపు పెళ్ళి విశేషాలు మాట్లాడుకున్నాం. చివరకు అసలు విషయానికి వచ్చాను.

''ఆ రాధ పూలరెమ్మలా ఉంటుంది పద్మక్కా....ఆ పిల్లకి మల్లెపూలకి అందంతో పాటు పరిమళం ఉన్నట్లు సకల సుగుణాలూ ఉన్నాయి సుమీ.... పెళ్లిలో చలాకీగా ఎంత పని చేసిందనుకున్నావ్?....''

పద్మక్క తలూపింది.

''అవున్రా....అది పెళ్లిలో చాలా పని చేసింది....దానికి అందమే కాకుండా ఎన్నికైన సుగుణాలున్నాయి....''

''ఆ పిల్లని చేసుకునే వాడెవడో కాని అదృష్టవంతుడు....''

''బాగా చెప్పావ్....దానికోసం ఏవడో మల్లెపూలతో పూజ చేస్తున్నాడు .... ఎవరో ఆ అదృష్టవంతుడు ... ''

''ఆ అదృష్టవంతుడు మన బాలరాజే ఎందుక్కాకూడదు పద్మక్కా..'' అక్కయ్య తెల్లబోయింది. చేస్తున్నపని ఆపేసి, నిలబడింది.

''వెంకట్రాజుకే అనుకున్నాను ... నీక్కూడా మతిపోయిందేమిట్రా ప్రకాశం... బాలుగాడివయసెంతరా ... వాడింకా కుర్ర వెధవేకద ...ఇంకా వాడుచదివింది బి.ఎస్సీ... వాడ్ని 'ఎమ్మెస్సీ' చదివించి, 'పి. హెచ్. డి'కి పంపాలని, ఆ తర్వాత 'ఫారిన్' పంపాలనీ మీ బావగారు ఎంత ఆశతో ఉన్నారో నీకు తెలియదా... చెప్పు ... అలాంటిది వాడికి పెళ్ళేమిట్రా ?..''

''అవుననుకో పద్మక్కా... వెంకట్రాజు రాధకి పెళ్ళిచెయ్యకుండా నాలుగేళ్ళపాటు ఉంచుతానన్నాడు కద...''

అక్కయ్య కొంతసేపు మాట్లాడలేదు. ఆ తర్వాత అన్నది:

''నాలుగేళ్ళకాలం తక్కువదేం కాదురా ప్రకాశం... నువ్వన్నట్లు రాధమ్మ ఇప్పుడు పూలరెమ్మలాగే ఉంది...అయితేదానిది ఎదిగే వయసు...నాలుగేళ్ళ తర్వాత అది ఎలా తయారవుతుందో ఎవరికెరుక? ఇప్పుడే అది అయిదడుగుల రెండంగుళాల పొడుగుంది... ఇంకో నాలుగైదు అంగుళాల పొడుగు ఎదగచ్చు...కొంచెం లావెక్కనూవచ్చు... అది అలా ఉంచు...మనవాడికి అది ఇప్పుడు నచ్చచ్చు... నాలుగేళ్ళ తర్వాత 'దాన్ని నేను చేసుకోనంటా'డనుకో, అప్పుడు దాని గతేం కావాలి? ఓ ఆడపిల్లకి లేనిపోని ఆశలు కల్పించకూడదురా... అదీకాక వెంకట్రాజు ఏమనుకుంటాడు ...అంత్య నిష్ఠూరంకంటే ఆదినిష్ఠూరమే మేలురా..''

పద్మక్కతో మరి వాదించదల్చుకోలేదు. తనను ఒప్పించగలనన్న నమ్మకం నాకు లేదు. మారు మాట్లాడక బయటకు వచ్చేశాను.

పందిట్లో వాలుకుర్చీలో కళ్ళుమూసుకుని, నుదుట చెయ్యి పెట్టుకుని కూర్చుని ఉన్నాడు బాలరాజు. దగ్గరకు వెళ్ళి పిలిచాను.

''బాలూ..''

''ఏం మామయ్యా...''

బాలరాజు కళ్ళు విప్పి చూశాడు. నేను జరిగింది చెబుదామనుకున్నంతలో ''నువ్వేమీ చెప్పనవసరంలేదు మామయ్యా ... అంతా విన్నాను...''అన్నాడు.

ఆ సాయంత్రం వెంకట్రాజూ, రాధా ప్రయాణమయ్యారు. పేరు పేరునా అందరికీ చెప్పి, బాలరాజు కోసం నలుదిక్కులా చూసి, తలవంచుకుని, 'టాక్సీ' ఎక్కింది రాధ.

బాలరాజు ఎక్కడున్నాడో నాకు తెలుసు. డాబామీద పిట్టగోడ దగ్గర నిలబడి రోడ్డు వైపు చూస్తున్నాడు. వాడి ముఖం కళా విహీనంగా ఉంది. 'టాక్సీ' కదిలాక కళ్ళు తుడుచుకోవడం గమనించక పోలేదు.

ఆరాత్రి బాలరాజు సరిగా భోజనం చెయ్యలేదు ఎవరితోనూ సరిగా మాట్లాడనూ లేదు. వాడి మనసు రాధ నుంచి తప్పించాలని

మీరు ఇద్దర్నే
ప్రపంచంలో గొప్ప
వాళ్ళని ఒప్పుకుంటా
నన్నారు కదా ఆ రెండో
ఆయన
ఎవరూ!

# బాలరాజు ప్రేమ కథ

షికారు బయల్దేరతీశాను. 'యూనివర్సిటీ' రోడ్డుమీద కొంతదూరం నడిచి, ఓ తూము మీద కూర్చున్నాం. నేను సిగరెట్టు ముట్టించుకుని, అన్నాను.

"ఓ సంగతిరా బాలూ...నువ్వు చిన్నపుచ్చుకుంటావని చెప్పలేదుకాని, రాధ నువ్వనుకున్నంత అందకత్తె కాదురా ... కాస్త పొడుగు తప్పించి, ఆ పిల్లలో ఏముంది ? కళ్లు కాస్త పెద్దవేననుకో, ముక్కూ బాగానే ఉందనుకో...మరిజడ ? ఆడదానికి ఒత్తయిన పొడవైన, జుత్తే అందంరా ... రాధ జడ భుజాలుదాటలేదు ... అదీకాక రంగు ? .. ఛామనఛాయ ... అంద చందాలమాట అలా ఉంచు ... నువ్వుపుట్టింది బొంబాయిలో ... మీ నాన్న ఉద్యోగరీత్యా బొంబాయిలో, ఢిల్లీలో, మద్రాసులో, హైద్రాబాదులలో పెరిగావు ... నీ అలవాట్లన్నీ పట్నవాసపు అలవాట్లు ... నీ భావాలన్నీ ఆధునికభావాలు ... మరి రాధ ? తణుకులో పుట్టి పెరిగింది. ఆ కట్టూ, బొట్టూ, ఆ మాటలూ, ఆ అలవాట్లూ పల్లెటూరి పిల్లని చెప్పక చెబుతున్నాయి. ఆ పిల్ల భావాలన్నీ పూర్వోత్తరానివే ... మీరిద్దరూ భిన్నధృవాలు ."

బాలరాజు నామీద కోపం తెచ్చుకున్నాడు.

"నీ మాటలకేం మామయ్యా .: రాధ బావుందని నువ్వే అన్నావు . ఇప్పుడు మాట మార్చేస్తున్నావు ... నాలుగేళ్ల తర్వాత రాధ ఎలాఉన్నా చేసుకుంటానన్నాను కద .అయినా మా అమ్మకి బుద్ధిలేదు మామయ్యా ... నేను ప్రేమించిన అమ్మాయిని నాకు కాకుండా చేసింది...ఇద్దరు ప్రేమికుల్ని విడదీసింది.."

నేనేం మాట్లాడలేదు. బాలరాజు దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు.

"కళ్లు మూసినా, తెరచినా రాధే కన్పిస్తోంది మామయ్యా. . నాహృదయాన్ని అర్పించాను... తను మాత్రం ? ఉన్న రెండ్రోజులూ నేనెక్కడ ఉంటే తనూ అక్కడే ఉండేది. నాకేం కావాల్సొచ్చినా తెచ్చి ఇచ్చేది. నన్ను గాఢంగా ప్రేమించింది మామయ్యా. . 'టాక్సీ' ఎక్కుతున్నప్పుడు రాధ ఎలాఉందో నువ్వే చూశావు కద మావయ్యా. కానీ మా అమ్మ మేమిద్దరం ఎప్పటికీ కలవకుండా చేసింది రాధని జీవితాంతమూ మర్చిపోలేను. ఆ లోటు ఎప్పటికీ పూడదు. మిగిలిన జీవితాన్ని జీవచ్ఛవంలా బ్రతకాలి నా జీవితం ముగింపు ఎంతో దూరంలో లేదు; నాకు విషాదమే మిగిలింది మావయ్యా..."

నేనేం మాట్లాడలేదు.

బాలరాజు వయసు అలాంటిది. ఆరాధ కాస్త బాగుంది. వాడితో చనువుగా మాట్లాడింది. ఆ పిల్ల వాడిని ఇంత గాఢంగా ప్రేమించిందో లేదో నాకు తెలియదు. అసలు రాధ అపురూప సౌందర్యవతేం కాదు కొద్ది రోజుల్లో బాలరాజు రాధని మర్చిపోవచ్చు ఆ వయసులో కుర్రకారు మనసు ఓ అమ్మాయిపైన స్థిరంగా నిలవదు ! రేప్పొద్దున్న రాధకన్న అందమైన అమ్మాయి వాడికి తారస పడితే వాడిమనసు రాధనుండి ఆ అమ్మాయి మీదకు మళ్ళుతుంది ఆతర్వాత అంతకన్నా అందమైన అమ్మాయి తారస పడితే ఆ అమ్మాయి మీద నిలవదు ! చదువు పూర్తయి, ఓ ఉద్యోగంలో స్థిరపడేంత వరకూ, వాడిమనసుకో స్థిరత్వం రాదు వయసు పెరిగిన కొద్దీ మనిషికి జీవితంతో రాజీ పడ్డం దానంతటదే అలవడుతుంది.

బాలరాజు అన్నట్లు వాడికి జీవితంలో విషాదమే మిగల్లేదు; వాడికి ఉజ్వలమైన భవిష్యత్తుంది. వాడన్నట్లు వాడి జీవితం ముగింపుకు రాలేదు; వాడి జీవితం ఇక్కడితోనే మొదలవుతుంది !










### ఉపక్రమణ

[రాత్రి. డాక్టర్ భాస్కర్ మేడమీద హాలు. ముచ్చటగా అలంకరించబడి వుంటుంది. ఒకప్రక్కన సోఫాలూ, తివాసీ. మధ్యలో చిన్న బల్ల, దానిమీద పువ్వుల తొట్టి. మూలగావున్న బల్లమీద వీణ. మరొక ప్రక్కన డైనింగ్ టేబిలూ, రెండు కుర్చీలు. మూడో కుర్చీ చిన్నపిల్లవాడు కూర్చుని తినటానికి వీలుగా ఎత్తుగా వుంటుంది. ఒక అల మారా, దానినిండా పిల్లల ఆటవస్తువులు. కుడి వైపునుండి బైటికి తలుపు ఎడమవైపున లోపల గదిలోకి ఇంకొక తలుపు. రెండు తలుపులకి మంచి పరదాలు. ఎదురుగా — అంటే — భోజనాల బల్ల దగ్గిరగా ఒక కిటికీ ఊచలు లేవు. అందులోంచి వీధిలోని దీపపు వెలుగులో ఎలక్ట్రిక్ తీగలు బాగా కనబడుతున్నవి.

సుమతి సోఫాలో కూర్చుని కూనిరాగంలో జోలపాడుతూ రాజాని నిద్రపుచ్చటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. పిల్లవాడి వయస్సు ఐదారేళ్ళు. సుమతి వయసు ఇరవైయారు, ముప్ఫైయి మధ్య చాల చక్కనిది. ఆమె విశాల నేత్రాలలో ఆనందం, తృప్తి వెల్లివిరుస్తున్నాయి.

సుమతి రాజా నిద్రపోతున్నాడనుకుని లేస్తుంది.]

సుమతి : చల్లగాలి వేస్తోంది. ఎందుకైనా మంచిది — దుప్పటి తెస్తా.

[సుమతి లోపలికి వెళ్తుంది. నిద్రవస్తున్నా అవుకోవటానికి ప్రయత్నిస్తున్న రాజా, కళ్ళుతెరచి చూస్తాడు. బయట రివ్వుమని గాలి. రెపరెప లాడుతూ, ఒక గాలిపటం ఎలక్ట్రిక్ తీగల్లో చిక్కు కుంటుంది.]

రాజా : అరే! [గభాలున లేచి, కిటికీలోకి ఎక్కి గాలిపటాన్ని తీయటానికి ప్రయత్నిస్తూ వుంటాడు. ఇంతలో సుమతి వస్తుంది. గాబరాగా "రాజా!" అని కేకవేస్తుంది. కంగారులో రాజా కిటికీలోంచి బయటికి పడిపోతాడు ]

సుమతి : బాబూ! బాబూ!! [హృదయ విదారకంగా అరుస్తూ కిటికీ దగ్గిరకు పరుగెత్తుతూ కూలిపోతుంది. నేపథ్యంలో విషాదకరమైన సంగీతం చీకటి ]

### మొదటి అంకం

[రెండేళ్ల తరువాత సాయంత్రం. డాక్టర్ భాస్కర్ ఇల్లు అంతా ఉపక్రమణలో వున్నట్లే

#### పాత్రలు

| | |
|---|---|
| డాక్టర్. భాస్కర్. | |
| సుమతి | — ఆయన భార్య. |
| రామయ్య | — వాళ్లింట్లో నౌకరు. |
| గోపీ | — తెగిపోయిన గాలిపటం. |
| లింగయ్య | — గోపీ తండ్రి. |
| వాణి | — సంఘ సేవకురాలు |
| రంగనాయకులు | — షావుకారు గుమస్తా. |
| పోలీసు ఇన్‌స్పెక్టర్. | |
| కానిస్టేబిల్. | |
| కథానాయకుడు | — రెండేళ్ళక్రితమే ప్రమాద వశాత్తూ మేడమీదనుంచి పడి మరణించిన రాజా. |

వుంటుంది. అలమారుమీద మాత్రం రాజా ఫొటో. దానికి లాకెట్టుతోసహా వున్న బంగారు గొలుసు. అలంకరణ — కిటికీలోంచి సుదూరంలో మైదానం. అందులో పిల్లలు గాలిపటాలు ఎగరేస్తూ మధ్య మధ్య కేరింతలుకొడుతూ పరుగెడుతూవుండటం, చూచాయిగా తెలుస్తూవుంటుంది. తెరతీసే సమ యానికి సుమతి కిటికీ దగ్గిర నిలబడి దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటుంది. మనిషి చాలా మారి పోయింది. ముఖంలో కళలేదు. భరింపరాని ఆవే దన, అనంతమైన దైన్యం ఆమె కళ్లల్లో కనపడు తున్నాయి. నేపథ్యంలోంచి విషాద సంగీతం ... వంటింటిలోంచి నౌకరు రామయ్య వస్తాడు. అతడికి రమారమి యాభై సంవత్సరాలు. కొంచెం పొట్టిగా వుంటాడు. నెరసిన జుట్టు. చూడగానే మనిషి చాల నమ్మకమైనవాడుగా కనిపిస్తాడు ]

రామయ్య : అమ్మగారూ

సుమతి · (ఉలికిపడి) ఏమిటి ?

రామయ్య : ఈరోజు సాయంత్రం టీ పార్టీకి వెళ్లాలి కదమ్మా? మీరు మర్చిపోయారేమో! అయ్యగారు వచ్చేవేళ అయింది.

సుమతి · (వినిపించుకోకుండా) రామయ్యా, అటు చూడు, ఆ తెల్లటి మబ్బుతునకల మధ్య గాలిపటాలెలా నాట్యం చేస్తున్నాయో! (బాధగా) నా చిన్నారి రాజా గాలిపటాలంటే కొట్టుకుపోయే వాడు. వాడే వుంటే ఈనాడు పిల్లలందరితోపాటూ గంతులు వేస్తూ ఉండేవాడు కదా. [అకస్మా త్తుగా కోపంతో ముఖం జేవురిస్తుంది ] పాడు పటాలు! రాజాని చూస్తూ చూస్తూ ఉండగానే పొట్టన పెట్టుకున్నాయి (గద్గదికంగా) భగవంతుడు నా హృదయంలో ఎంత చిచ్చుపెట్టాడు! నా కసలు రాజానియ్యకుండా ఉంటేనే బాగుండేది ..

రామయ్య : అమ్మా, అవన్నీ జ్ఞప్తికి తెచ్చు కుని మీరు మనసు పాడుచేసుకుంటున్నారు. ఇచ్చే హక్కూ తీసుకునే హక్కూ పైవాడిది. ఎంత బాధపడినా పోయినవాళ్లని మనం తీసుకుని రాలేం కదా!

సుమతి · (చిరాకుగా) పోయాడూ పోయాడని మీరందరూ ఒకటేమాట నా రాజా ఎక్కడికి పోయాడు? ప్రతి క్షణం నా కళ్ళముందే మెదులు తున్నాడు. నా చెవుల్లో అహర్నిశలూ, వాడి ముద్దు మాటలే వినబడుతున్నాయి (కళ్లనీళ్లతో) నాకీ లోకంలో రాజా తప్ప ఎవరున్నారు ?

[రామయ్య ఆమె బాధను అర్థం చేసుకున్నట్లు తల ఊపుతూ ఏదో అనబోతాడు. కాని ఇంతలో కాలింగుబెల్ మ్రోగుతుంది.]

రామయ్య : అదుగో, అయ్యగారు వచ్చేసినట్లు న్నారు! (వెళ్లి తలుపు తీస్తాడు.) "హో మీరా! దయచేయండి. [గిరుక్కుని లోపలికి వెళ్లిపోతాడు. వాణి ప్రవేశిస్తుంది. ఆమెకు దాదాపు సుమతి వయస్సే ఉంటుంది చాలా ఆధునికంగా అలంక రించుకుంటుంది. మంచి రూపు రేఖలు. చదువు కున్నది. సంఘ సేవకురాలు.]

వాణి : (హడావడిగా) హల్లో, సుమతీ, ఇంకా రెడీ కాలేదేమిటి ?

సుమతి . (పరధ్యాన్నంగా కిటికీలోంచి చూస్తూ పలకదు )

వాణి : (దగ్గరగా వచ్చి భుజం తట్టుతూ) ఏమిటి సుమతీ, ఈ లోకంలో ఉన్నట్టులేవే ?

సుమతి : (నిట్టూరుస్తూ) నాకు అంత అదృష్టంకూడానా ? ఈ లోకంలో ఉన్నానుకాబట్టే బాధ. ఆ పార్కులో చూడు! రంగు రంగుల గాలి పటాలు ఎగరేస్తూ పిల్లలు ఎంత ఆనందంగా గంతు లేస్తున్నారో! వాళ్ళీ పాడులోకంలోనే వున్నారం టావా ? ఆ గాలిపటాలతోపాటూ వాళ్ల చిన్నారి

మనసులుకూడా వినువీధుల్లో ఎక్కడెక్కడో ఎగిరి పోతున్నాయి. అందుకే వాళ్ల కంత సంతోషం కాని నేనో — పంజరంలో చిక్కిన పక్షిలా పడి వున్నాను నా కెప్పుడో విముక్తి

వాణి నీవు రోజు రోజుకీ ఆవేదనతో కృంగి పోతున్నావు నీ బాధ చూస్తూ భాస్కర్ కూడా ఎంత కుమిలిపోతున్నాడో నేను గమనించకపోలేదు. కాని ఒక్క మాట వింటావా ? ఇలా గతాన్ని మరచి పోకుండా మనస్సులు పాడుచేసుకుని మీా ఇద్దరి జీవితాల్లో అంతులేని నైరాశ్యం తెచ్చిపెట్టుకోవటం ఏమీా బాగాలేదు నేను శుష్క వేదాంతం చెబు తున్నాననుకుంటావేమో !

సుమతి శుష్కమైంది జీవితంగాని వేదాంతం కాదు. నేను కాపరానికి వచ్చిన క్రొత్తలో ఎన్నో తియ్యని కలలు కన్నాను జీవితంలో ఏదో మధురాతి మధురమైన అనుభూతి ఉందనీ, అందులో శాశ్వత

## సీరియల్ నాటకం ప్రారంభం

మైన సంతోషం లభిస్తుందనీ ఊహించుకున్నాను కాని నా కలలన్నీ కల్లలుచేసి వెళ్లిపోయాడు నా రాజా నువ్వే చెప్పు. నాకిప్పుడు అంధకారంతప్ప వేరే ఏముంది ?

వాణి : సుమతీ, నీకు తగిలిన గాయం స్వల్ప మైనదనీ, అది అంత సులాగ్గా మానిపోతుందనీ నేనెలా అనగలను ? తల్లివికాబట్టి ఈ గర్భశోకం జన్మపర్యంతం ఉండేదే అయితే పోయినవాళ్లతో ముడివేసుకుని ఎంతకాలం ఇలా బాధపడతావు ? ఈ సంసారంలో నీకూ ఒక ముఖ్యమైన బాధ్యత ఉందని మరచిపోతున్నావు.

సుమతి : నన్నేం చేయమంటావు వాణీ? ఎంత



ప్రయత్నించినా నా మనసు ఈ విపరీతమైన ఆఘా తానికి తట్టుకోలేకపోతూవుంది. ఒక్కక్షణం కళ్లు మూసుకుంటే రాజాయే కనబడతాడు. వాడి నెలా గైనా మరిచిపోవాలనీ, మనసు రాయి చేసుకోవాలనీ ఎంత ప్రయత్నిస్తున్నానో ఆ భగవంతునికే తెలుసు

వాణి పోనీలే, ఆ సంగతి ఇప్పుడెందుకు ? పద, తయారవుదువుగాని.

సుమతి (ఆశ్చర్యంగా) తయ్యారా? ఎందుకూ?

వాణి అసలు సంగతే మరిచిపోయూవన్న మాట! ఈవేళ విశ్వనాథంగారింట్లో వాళ్లబ్బాయి పుట్టినరోజు పండుగ. టీపార్టీకి సరదాగా కలిసి వెళ్దామని భాస్కర్ చెప్పాడు (గడియారం చూస్తూ) భాస్కర్‌కూడా వచ్చేస్తుంటాడు. నువ్వు త్వరగా రెడీ అయితే బాగుంటుంది.

సుమతి . పుట్టిన రోజా ? (ఉలిక్కిపడి) ఔనౌను! పూర్తిగా మర్చిపోయాను (ఏదో ఆలో చిస్తూ లోపలికి వెళ్తుంది.)

వాణి: మరి వెళ్లి చీర మార్చుకుని రా! తొందరగా వస్తావుకదూ ? మనం గంటలకొద్దీ ముస్తాబులు చేస్తామని ఎగతాళిచేస్తాడు భాస్కర్

[వాణి వీణ దగ్గిర కూర్చుని మీటుతూ పాడు తుంటుంది భాస్కర్ ప్రవేశించడం ఆమె గమ నించదు భాస్కర్ వయస్సు 35, 36 సంవత్స రాలు వుంటుంది నిండైన విగ్రహం చదువు, సంస్కారం ఉట్టిపడుతుంటాయి లోపలికి వచ్చిన భాస్కర్ అచేతనంగా నిలబడి పరవశత్వంలో తనని తానే మర్చిపోతాడు పాట అయిపోగానే వాణి వెనక్కి తిరిగి సిగ్గుపడుతుంది ]

భాస్కర్ (నెమ్మదిగా చప్పట్లుకొడుతూ) చాలా బాగుంది ! వాణీ, నువ్వింత బాగా పాడతావని నాకు తెలియదే !

వాణి · (చిరుసిగ్గుతో) అభిమానంకొద్దీ అలా అన్నావుకాని నా పాటలో ఏముంది ?

భాస్కర్ ఒకప్పుడు సుమతి పాడుతూవుంటే నన్ను నేను మరిచిపోయేవాడిని ఇప్పుడు సుమతి పాడటమే మానేసింది. నేను చాలా దురదృష్ట వంతుణ్ణి, వాణీ

వాణి. (జాలిగా) నీ హృదయంలో రగులు తూన్న అశాంతి నాకు పూర్తిగా తె , స్కర్ సుమతి రోజు రోజుకీ కృశించిపో ంది గైనా ఆమెలోని దిగులు పోగొట్టి మళ్లీ మ లో గానిగా చెయ్యాలని నేను చేతనయినంత ప హా ప్రయత్ని స్తూనే వున్నాను

భాస్కర్ (నిస్పృహగా) ఏం ప్రయత్నమో ఏమిటో! ఈ యింట్లో ఒకప్పుడు ఆనందం వెల్లి విరిసింది రాజా ముద్దుమాటలు వింటూ వాడి చిలిపిచేష్టలు చూస్తూ మురిసిపోయేవాళ్లం వాడి అల్లరితో ఇల్లు కళకళలాడుతూ వుండేది సుమతి ఎప్పుడూ వాడితో ఆడుతూ పాడుతూవుంటే రోజులు ఇలాగే గడిచిపోతాయనుకునేవాణ్ణి. కాని అంతా తారుమారైపోయింది. (కొంచెం నెమ్మ

దిగా) ఇంటికి రావాలంటేనే నాకు ఏదో చెప్పరాని బాధగా ఉంటుంది.

వాణి . (దగ్గరగా వెళ్ళి) నువ్వుకూడా యిలా నీరుగారిపోతే ఎలా ? సుమతిని ఒక దారికి తేవడం నీ కర్తవ్యం

భాస్కర్ : (కొంచెం కోపంగా) నా కర్తవ్యమా ?

వాణి . నన్ను అపార్థం చేసుకోవద్దు భార్యాభర్తల్లో ఒకరు మానసికంగా బలహీనంగా వున్నప్పుడు, మరొకరికి బాధ్యత వుంటుందని చెప్తున్నాను ఈ పరిస్థితుల్లో నువ్వు సుమతిని పూర్తిగా అర్థంచేసుకుని ఆమె బాధని తీర్చడానికి ప్రయత్నించు నువ్వు ఏమాత్రం తొందరపడ్డా చాలా విపరీత పరిణామాలు రావచ్చు

భాస్కర్ . అందుకనే నేనెంతో ఓర్పుతో ఆమెకు బాధ కలగకుండా మసలుకుంటున్నాను. అంతకంటే నేనేం చేసేది ? ఆమె మనసు ఛిన్నాభిన్నమయి పోయింది తన బాధేగాని ఇతరులకిగూడ బాధ వుంటుందని ఆమెకి తెలియటంలేదు ఈ సమస్య నీకు తెలుసుకాబట్టి నన్నర్థం చేసుకోగలిగావు అలాగే సుమతి కూడా అర్థంచేసుకుంటే నేను అదృష్టవంతుణ్ణే !

వాణి తెలిసినా నేనేం చెయ్యగలను ? నీకు ఏవిధంగానూ మనశ్శాంతిని ఇవ్వలేనుగదా ?

రామయ్య (హడావడిగా వచ్చి) అరె ! బాబుగారొచ్చారే ! ఉండండి టీ తీసుకొస్తాను

భాస్కర్ ఇప్పుడు ఎందుకు రామయ్యా ? విశ్వనాథంగారి ఇంటికి టీపార్టీకి వెళ్దామని అమ్మగారిని రెడీగా వుండమన్నాను టైమైపోయింది త్వరగా రమ్మని చెప్పు

రామయ్య అలాగేనండీ (వెళ్ళిపోతాడు ఇంతలో సుమతి వస్తుంది )

వాణి అదేమిటి సుమతీ ? నువ్వు రెడీ అవుతున్నావని అనుకున్నాను బట్టలుకూడా మార్చలేదేం ? విశ్వనాథంగారి అబ్బాయి పుట్టినరోజు పండక్కు వెళ్దామనుకున్నాంగా ?

## గాలిపటాలు

సుమతి · (భాస్కర్‌తో హీనంగా) ఎలా వెళ్లనండీ ?

భాస్కర్ . ఏం ? ఎలా ఏమిటీ ? మన కారులో వెళ్దాం

సుమతి : (వినీ విననట్లు భాస్కర్‌వైపు తిరిగి) ఏమండీ, మీకు జ్ఞాపకంలేదా ? ఈవేళ ఎవరి పుట్టినరోజనుకుంటున్నారు ?

భాస్కర్ (మాట్లాడడు)

సుమతి అప్పుడే మర్చిపోయారా ? రెండేళ్లనాడు ఇదే రోజు ఎంత వైభవంగా రాజా పుట్టిన రోజు చేసుకున్నాం !

వాణి (ఆశ్చర్యంగా) ఈరోజు రాజా "బర్త్ డే"నా ?

సుమతి అవును వాణీ ఆనాడు నువ్వేగా దగ్గర నిలబడి వాడిచేత బర్త్ డే కేక్ కోయించావు ఏడు కొవ్వొత్తులూ ఒక్కసారిగా ఉఫ్ మని ఆర్పేస్తే మనమంతా ఎంత సంబరపడ్డామో జ్ఞాపకం లేదూ ! నువ్వు మరిచిపోయావేమో ఆనాడింకో సంగతికూడ జరిగింది రాజాకోసం భాస్కర్ ఒక సూట్ తెచ్చారు

వాణి అవునవును అది రాజాకి చాలా పెద్దదైపోయింది కదూ

సుమతి పాపం ! నిజంగా భాస్కర్ చాలా చిన్నబుచ్చుకున్నారు 'పోనీలెద్దురూ, వచ్చే పుట్టిన రోజుకి జాగ్రత్తగా దాచిపెడతావ'న్నాను. (అకస్మాత్తుగా కళ్లనీళ్లతో) ఆరోజు రానేలేదు ! (ఇంతలో టెలిఫోను గణ గణ మ్రోగుతుంది భాస్కర్ ఫోను తీసుకుంటాడు )

భాస్కర్ హల్లో ! తొమ్మిదోనంబరు వార్డా.. ఎవరూ నర్సిమ్మలా ? న్యుమోనియా కేసేగా ? అలాగే, ఇప్పుడే వస్తున్నాను (టెలిఫోను పెట్టేసి) నేను అర్జంటుగా వెళ్లాలి. పిల్లవాడు చావుబతుకుల మధ్య వున్నాడు ..

వాణి . మరి విశ్వనాథంగారి ఇంటికో !

భాస్కర్ . నాకు వీలుకాదు వాణీ —

సుమతి పిల్లవాడా ? పాపం ! తొందరగా వెళ్లండి — ఆ తల్లి రాత ఎలావుందో !

భాస్కర్ వాణీ, నీకు చాలా శ్రమ ఇచ్చాం కదూ విశ్వనాథంగారిల్లు దారిలోనే ఉంది నిన్నక్కడ డ్రాప్ చేస్తా (కొంచెం నవ్వుతో) డాక్టర్లతో ముడిపెట్టుకుంటే ఇదే తంటా

వాణి (చిరునవ్వుతో) అది నాకూ తెలుసు పార్టీకేంలే ? ముందు పిల్లవాడి సంగతిచూడు. సుమతీ ! మరి నేను వస్తాను

రామయ్య (ఆదరాబాదరాగా టీ తీసుకొస్తూ) బాబూ — ఇదిగో టీ, తీసుకోండి

భాస్కర్ ఇప్పుడు టైం లేదు రామయ్యా

(భాస్కర్ వాణీ వెళ్లిపోతారు సుమతి పరధ్యాన్నంగా కిటికీదగ్గరకి వెళ్లి చూస్తూవుంటుంది )

రామయ్య మీరన్నా టీ తీసుకోండమ్మా

సుమతి వద్దు లైటు ఆర్పేసి నీ పని చూసుకో

[రామయ్య నిట్టూరుస్తూ టీ తీసుకుని వెళ్లిపోతాడు కిటికీలో ఎగురుతున్న గాలిపటం ]

సుమతి (విపరీతమైన ఆవేదనతో) పడగలు గాలిపడగలు ! బుసలు కొడుతున్న పాము పడగలు !! నా బాబుని కాటేసిన పడగలు (భరించలేని బాధతో) రాజా ! (కెవ్వున కేకవేసి పడిపోతుంది లోపలనుంచి రామయ్య "అమ్మా" అని పరిగెత్తుకు వస్తాడు సంగీతం — చీకటి.)

## కొంచెం వ్యవధి

[ఇంకో గంటన్నర తరువాత సుమతి అచేతనంగా సోఫాలో కూర్చునివుంటుంది భాస్కర్, గోపీ వస్తారు గోపీకి ఏడెనిమిది ఏళ్ళుంటాయి చిరిగి మాసిపోయిన బట్టలు — జుట్టు కళ్లమీద పడుతూ ఉంటుంది — మాటల్లో యాస — ఫొటోలో ఉన్న రాజాకి మంచి పోలిక కొంటెవాడైనా క్రొత్త యింట్లోకి రావడానికి భయపడుతున్నట్లు కనబడతాడు ]

భాస్కర్ సుమతీ, ఎవరు వచ్చారో చూశావా ? (గోపీతో) రా, గోపీ ! ఏమీ భయంలేదులే ! (గోపీ తత్తర బిత్తరగా చూస్తుంటే) నేను చెప్తున్నానుగా, ఇది నీ ఇల్లే అనుకోరా . ఈ సోఫాలో కూర్చుందువుగాని అదేమిటి సుమతీ, ఇంత పరధ్యాన్నమైతే ఎలా ? ఇటుచూడు — గోపీ వచ్చాడు.

సుమతి (అనాలోచితంగా) గోపీ ! ఎవరూ ? (చూచి వెనక్కి తగ్గి కొంచెం చీదరగా) ఛీ, వీణ్ణెక్కడనుంచి పట్టుకొచ్చారు ?

భాస్కర్ అలా చూస్తావేం సుమతీ ! గోపీ అంటే ఎవరనుకున్నావు ? ఇందాక టెలిఫోను రాలేదూ ఒక సీరియస్ కేసు వుందనీ ? — ఆ నరసింహులు వీడి అన్న, పాపం ! ఆ పిల్లవాడు చావుబ్రతుకుల్లో వున్నా తల్లిదండ్రులెవరూ రాలేదు — ఇందాకే అయిపోయిందనుకున్నాను. రెండు ఇంజెక్షన్లు ఇచ్చిం తరువాత కొంచెం తేరుకున్నాడు. కాని యింకా పరిస్థితి అపాయకరంగానే వుంది. వాడెలా వున్నాడో



చూచిరమ్మని గోపీని వాడి తండ్రి ప్రొద్దుటనగా పంపాడట వీడేమీ తెలియక పిచ్చివాడిలా తిరుగుతూ వుంటే తీసుకొచ్చాను ఔనా గోపీ ? (గోపీ కిటికీలోంచి బైటికి చూస్తూవుంటాడు)

గోపీ నిజమేనండీ అయ్యగారూ మా నాయన అన్నని చూసుకోరా ! అని పొద్దుగాల పంపిండు లోపలికి పోతానంటే దవాఖానా గేటుదగ్గర దర్వానుగాడు అటకాయించేసిండు దవాఖానా అంతా వాడిదే అనుకున్నాడు. నేనుమాత్రం అంత బుర్రలేనివాడినా ? వాడు వేరే దిక్కు చూస్తుంటే లోపలికి వురికినా (నవ్వుతూ) వాడొకటే గోల !

భాస్కర్ · అయితే నువ్వు ప్రొద్దుటినుంచీ ఏమీ తినలేదన్నమాట

గోపీ లేదండీ

భాస్కర్ అయ్యో పాపం ! గోపీకి కొంచెం భోజనం పెట్టించు సుమతీ.

సుమతి (ఉలిక్కిపడి) అలాగే. రామయ్యా, రామయ్యా ! ఈ పిల్లవాడిని తీసికెళ్లి తినటానికి ఏమైనా పడెయ్యి

రామయ్య (లోపల్నించి వచ్చి) అలాగేనమ్మా

భాస్కర్ కొంచెం ఉండు. ముందు గోపీకి స్నానం చేయించి శుభ్రమైన బట్టలు వేస్తే బాగుంటుందేమో ఏమంటావు గోపీ ! తొందరగా స్నానం చేసివస్తావా ?

గోపీ (ఉత్సాహంతో) సరేనండీ అయ్యగారూ

భాస్కర్ ఏం ? అలా ఆగిపోయావు ?

గోపీ (నసుగుతూ) ఏమీ లేదండీ

భాస్కర్ చెప్పు గోపీ, నీ కిక్కడ ఏమీ భయంలేదని చెప్పానుగా !

గోపీ నాకు వేరే బట్టలు లేవండీ ఇవే వేసుకుంటాను

సుమతి (కొంచెం తొందరపాటుగా) నీ యిష్టం ఇక్కడ నీకు చీని చీనాంబరాలు కట్టబెట్టడానికి ఎవ్వరూ లేరు

గోపీ అదేమిటండీ చినీచీ

సుమతి (చిరాకుగా) నీకవన్నీ తెలియవులే .. రామయ్యా, వీణ్ణి తీసుకువెళ్లి — స్నానం చేయించు. (గోపీ బయటకు పోబోతాడు) అదేమిటిరా బయటికి వెళ్తావేం ? ఇటు .

గోపీ (ఆశ్చర్యంగా) నల్లా బయటగదండీ వుంట ! (ఏదో జ్ఞప్తికిరాగా) మొన్న మా గూడెం దగ్గర భలే తమాషా జరిగింది. కొంచెం వళ్లు తడుపుకుందామని దోస్తులతో వెళ్లానుకాని ఆడోళ్లు ఊరుకుంటారా ? దొంతర్లుగా పెట్టేసినారు కుండలు కొంచెం జరపండి అంటే నానాతిట్లు, తాగటానికి నీళ్లులేవు, ఈ వాజమ్మలు స్నానం చేస్తారంటని మూతులిరుచుకున్నారు (ఆగి) వాళ్లకింత కావరమా అని అయ్యగారూ, నేనేం చేశానో తెలుసా ..

సుమతి చనువిచ్చారుగదా అని ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నాడు వింటుంటే నా వంటి మీద తేళ్లూ జెర్రులూ పాకినట్టుంది (కొంచెం విసుగ్గా) ఈ పురాణమంతా మనం ఓపిగ్గా వినాల్సిందేనా ?

భాస్కర్ · కొంచెం ఓపికపట్టు సుమతీ. (గోపీతో) ఏం చేశావేమిటి ?

గోపీ ఏం చేశానా ? గులేలు తీసుకుని నాలుగు కుండలు టపాటపా బద్దలుకొట్టాను ఇక చూడాలి తమాషా ! ఒకటేగోల ! నేనప్పుడు పారిపోయి వచ్చేశాను

భాస్కర్ భలేవాడివే ? అలా చెయ్యొచ్చా .. తప్పుకదూ ? పోనీలే . వెళ్లి స్నానం చేసిరా (గోపీ రామయ్యవెంట వెళ్తాడు) సుమతీ, గోపీకేమన్నా బట్టలు తీసిపెట్టు.

సుమతి బట్టలా ? నుంచున్నపళంగా బట్టలెక్కడనుంచి వస్తాయండీ ?

భాస్కర్ (సంకోచిస్తూ) రా. జా ..వి ఏమన్నా సరిపోతాయేమో చూడు

సుమతి (ఆశ్చర్యంగా) ఆ, ఏమంటున్నారూ ? రాజా బట్టలా ?

భాస్కర్ అవును రాజా బట్టలే (కొంచెం ఆగి) రాజా ప్రసక్తి ఏవిధంగా వచ్చినా నీ మనస్సు కలవరపడిపోతుందన్న సంగతి నాకు తెలుసు అయితే జీవిత సత్యాన్ని ఎదుర్కోకుండా ఎంతకాలం నువ్విలా నీమండే పారిపోగలవు ? పిచ్చిదానా, పోయిన రాజా తిరిగివస్తాడా ? దేనికోసం వాడి బట్టలూ ఆటవస్తువులూ ప్రాణపదంగా దాచుకొంటున్నావు ? వాడిచుట్టూ ఏదో ఒక ప్రపంచం నిర్మించుకుని అందులోనే జీవిస్తామనుకుంటున్నావు అంతేనా ? కాని అది జరిగే పనికాదు

సుమతి · (కోపంగా) భాస్కర్, నా ప్రపంచం నీ ప్రపంచం అని వేరే వున్నాయా ? అంతా ఒకటే నన్నిలా వుండనీ చూస్తూ చూస్తూ రాజా వేసుకున్న బట్టలు ఈ దౌర్భాగ్యుడికి ఇవ్వమనటానికి నీకు మనస్సెలా ఒప్పింది ? అయినా నాకు తెలీకదుగుతాను — అతి సుకుమారంగా పెరిగిన మన రాజాబట్టలు ఈ మురికివెధవకెలా కట్టబెడతారండీ ?

భాస్కర్ మురికివెధవా ! ? వాడు నీ పిల్లవాడు కాదుగాబట్టి నీ కళ్లకి అలాగే కనబడతాడు. అదేమాట వాడి తల్లి నడుగు ఏం చెబుతుందో ! అయినా — (ఒక ఆలోచన తట్టగా) మన రాజాయే వుంటే వాడికీ గోపీ వయస్సేగా (కొంచెం కంగారుగా) ఆనాడు పుట్టినరోజు పండక్కి తెచ్చిన డ్రెస్ .. అది సరిపోతుందనుకుంటాను కొంచెం చూడు

సుమతి ఆనాడు నా బంగారుతండ్రికి తెచ్చిన సూటా ? అది ఈ గోపీగాడికి కట్టబెట్టమంటారా ? ఏదో దారినపోయే పిల్లవాడికి నాలుగు మెతుకులు పడేసి పంపిస్తే సరిపోయేదానికి బదులు ఈ ఘన సన్మానం ఏమిటి ? (ఆవేదన ఎక్కువవుతుండగా) సరే, అలాగే చెయ్యండి. నా చిన్నారి తండ్రి బట్టలన్నీ వీడికే కట్టబెట్టండి నా గుండె బ్రద్దలైపోతూ వుంటే మీరు చూచి ఆనందించండి .

(ఇంకా ఉంది)

# మినీ ఇంటర్వ్యూ

వి విశ్వేశ్వరరావు ఇప్పుడు గ్రాడ్యుయేట్ అయినాడు ఘంటసాల స్వగ్రామం. వాళ్ల వూళ్లో సినిమా హాలు ఈమధ్యనే కట్టారుగాని — అతనుమాత్రం మంచి కథ వున్న సినిమాని మాత్రం చూస్తాడు అభిమాన నటులు నటీమణులు లేరు రాజ్‌బాబు అంటే ఇష్టం ఉద్యోగం రాకపోతే చదువును సార్థకం చేస్తూ వ్యాపారంలోకి దిగటం కూడా మంచిదే, లేకపోతే అంతా ఉద్యోగాలు అంటే నిరుద్యోగ సమస్య ఎట్లా ? అంటాడు వారపత్రికలో ప్రశ్నావళి మొదట చదువుతాడు రామలక్ష్మిగారు గమ్మత్తుగా చెబుతారు సమాధానాలు



కో ఎడ్యుకేషన్ మంచిదేగాని అమ్మాయిలను అల్లరిచేయకూడదంటాడు టీచర్‌లు బాగా చెప్పేవారైతే అంతా గౌరవిస్తారు పాఠాలు సరిగ్గా చెప్పేవారు లేకపోతే సహజంగానే అల్లరిచేస్తారు విద్యార్థులు అంటాడు ఉద్యమంలో మరీ లోతుగా కాదుగాని, ఉపవాసాలు గట్రా చేశాడు

వ్యవసాయంలో దిగుదామా అంటే వాళ్ల అన్నయ్య అందులో దిగాడు కదాని మానేశాడు పెళ్లిగట్రా మొదట స్థిరపడ్డాక నాన్నగారు చెప్పే మాటలు విని ఆలోచిస్తాడట. చురుకైనవాడు. సైకిలు మహాసర్దా, కాని స్కూటర్ కొనుక్కోవాలని ప్రయత్నం చేస్తున్నాడు.

రాజకీయాలు పెద్ద సర్దాలేదు గాని, వార్తాపత్రికలు చదువుతాడు రేడియోలో మంచి ఉపన్యాసాలు, నాటకాలు వింటాడు ఫ్యాషన్‌లు తగుమాత్రంగా అనుసరిస్తాడు . బందరు బెజవాడలలో రెండూ ఒకే మాదిరిగా యిష్టపడతాడు

సినిమాల్లో ముద్దులు పెడితే అసహజంగా వుంటుంది అనుకుంటాడు . కార్టూన్‌లు, జోకులు అవీ యిష్టం...ప్రస్తుతం జనరల్‌నాలెడ్జి పెంపొందించుకుంటున్నాడు.

[ గీతా ఫీచర్స్ ]

## దంపతులుగా రేలంగి, ప్రమీల

పరువం పొంగే పడుచుపిల్ల ప్రమీల. ప్రమీలకు సమవయస్కురాలైన కూతురికి తండ్రి రేలంగి. వయస్సులో బోలెడంత తేడా వున్నా, వధూవరులయ్యారు ఇద్దరు అది వాళ్లిద్దరికీ మొదటి రాత్రి. తొలిరేయి ఎంతో హాయిగా గడపాలని ప్రతి ఆలు, మగలు కలలు కనడం సహజం. కాని పాపం ఇంతలో వారి ఆనందానికి అంతరాయం.

రేలంగి కూతురు జయసుధ వొట్టి పిచ్చి పిల్ల. తన తండ్రికని ప్రిన్ని పట్టుకెళుతున్న పాలగ్లాసుని కొట్టేసి, పిచ్చిగా నాట్యం చేస్తూ, ఇలా పాడసాగింది.

"నాన్నా! పిచ్చినాన్నా,
ఎవరికి పిచ్చి! నీకు పిచ్చి, నీ యబ్బకు పిచ్చి, నీ తాతకు పిచ్చి, ముత్తాతకు పిచ్చి, నిన్ను పెళ్లిచేసుకున్న పిన్నికి పిచ్చి" అంటూ గదంతా గల్లంతు చేసింది అల్లరిపిల్ల జయసుధ. పిచ్చిపిల్ల పాటపాడుతున్నప్పుడు తండ్రి వినాయకుడిలా, దయాదాక్షిణ్యాలు లేని అన్న రావణాసురుడిలా కనిపించాడు ఆ అమ్మాయికి.

గమ్మత్తయిన ఈ ఘట్టం నవభారత్ ఆర్ట్ ఫిలింస్‌వారి "ముగ్గురమ్మాయిలు" చిత్రంలో చూడొచ్చు. ప్రత్యేకత వుండేట్టు ప్రత్యగాత్మ దర్శకత్వం నిర్వహిస్తున్న ఈ చిత్రాన్ని పి. ఎస్. ప్రకాశరావు నిర్మిస్తున్నారు. లక్ష్మి విడుదల.

## మధు పిక్చర్స్ చిత్రం

డిశంబరు 23 న ప్రారంభమైంది. ఇంత వరకు ఆరు చక్కని చిత్రాలను అందించి, పేరొందిన ఈ సంస్థకు పి. మల్లికార్జున రావు అధినేత. ఇటీవల 7 వ చిత్రం తాలూకు ఓ పాటను సంగీత దర్శకుడు చక్రవర్తి, జెమినీ రికార్డింగు థియేటర్లో రికార్డు చేయించారు.

జానపద గేయరాజు కొసరాజు వ్రాసిన,

"చిన్నారి, పొన్నారి బుల్లెమ్మా
వన్నె, వాసి కలిగి వర్ధిల్లమ్మా"

పాటను జానకి, జిక్కి పోటాపోటీగా పాడారు. ఇప్పటికి నాలుగు పాటలు రికార్డింగు జరిగింది.

"పండంటి కాపురం" లాంటి సిల్వర్ జూబ్లీ చిత్రానికి దర్శకుడైన పి. లక్ష్మీదీపక్ ఈ చిత్రానికి నిర్దేశకుడు. మాటలను ఆరుద్ర, కళను ఎస్. కృష్ణారావు, ఛాయను ఏ. ఆర్. కె. మూర్తి నిర్వహిస్తున్న ఈ చిత్రంలో రంగారావు, గుమ్మడి, చంద్రమోహన్, మిక్కిలినేని, ప్రమీల, ఎస్. వరలక్ష్మి, పి. ఆర్. వరలక్ష్మి, రోజారమణి, జూ. శ్రీరంజని ముఖ్య తారాగణం.

మధ్యతరగతి కుటుంబాలు ఎదుర్కొనే సమస్యలు, కష్టాలను సోదాహరణంగా వివరిస్తూ నిర్మింపబడుతున్న ఈ చిత్రం శ్రీఫిలింస్ విడుదల.



"కోడెనాగు"లో శోభన్‌బాబు



"మంచివాడు" లో ఒక సన్నివేశం

## మమతా కంబైన్స్

కృష్ణంరాజు భోగపురుషుడు. శోకిలా రాయుడు. జీవితాన్ని విలాసంతో, కులాసాగా గడిపెయ్యాలనుకొనే రకం. బ్రాందీ కైపుకు, భామ కౌగిలికి బానిసయిపోయిన కృష్ణంరాజు హార్స్లీ హిల్స్‌కు ఉల్లాసపయనం కట్టాడు. వంటరిగా వెళ్లడం అలవాటులేని కృష్ణంరాజు, తనతో డజనుమంది పడుచుపిల్లలను వెంటబెట్టుకొని వెళ్లాడు.

అసలే జాలీటైపు. ఇక జవ్వనులు ప్రక్కనుంటే చెప్పాలా ?

"జీవితం ఏమంటున్నది ?
అనుభవించమంటున్నది.
కౌగిలి ఏమంటున్నది ?
ఒకటై పొమ్మంటున్నది."

అంటూ హుషారుగా పాడాడు కృష్ణంరాజు మమతా కంబైన్స్‌వారి "పల్లెపడుచు" చిత్రంలో. దాశరధి వ్రాసిన ఈ పాటను రాజేశ్వరరావు సంగీత నిర్దేశకత్వంలో బాలసుబ్రమణ్యం, కోరస్ పాడారు.

ఊర్వశి శారద కథానాయికగా నటిస్తున్న




ఈ చిత్రానికి ఎడిటరు సత్యం దర్శకుడు. వాశిరాజు ప్రకాశం నిర్మాత.

## చలన చిత్రంగా చలం ''మైదానం''

ప్రసిద్ధ రచయిత గుడిపాటి వెంకటాచలం విరచితమైన ''మైదానం'' నవలను దర్శక, నిర్మాత వైకుంఠ రామశర్మ తెరపైకెక్కిస్తున్నారు. డిశంబరు ఎనిమిదవ తేదీ సాయంత్రం, శాస్త్రోక్తంగా పూజా కార్యక్రమాన్ని నిర్వహించి, పరిశ్రమలోని పలువురి శుభాశీస్సులు అందుకున్నారు.

చిత్రంలోని ప్రధాన పాత్రలను నూతన కళాకారులైన దయానంద్, హరిప్రసాద్, మమతలచే పోషింపచేయడం దర్శకుని ధైర్యాన్ని చాటిచెబుతోంది. ఫిబ్రవరిలో సెట్స్ పైకి వెళుతున్న ఈ చిత్రంలోని ఎక్కువ భాగం మైసూరు ప్రాంతమందలి ''తలకాడు'' పరిసరాల్లో, అవుట్‌డోర్లో చిత్రీకరించబోతున్నట్లు, మార్చి మాసాంతానికి పూర్తి చేసి, చిత్రాన్ని ఏప్రిల్‌లో విడుదల చేయ సంకల్పిస్తున్నట్టు చెప్పారు ఆర్ట్ మూవీస్ సంస్థ నిర్మాత వైకుంఠ రామశర్మ


''శ్రీ గౌరవం'' లో దేవిక, రాజబాబు

## నారదుడిగా రాజబాబు !

లావణ్య పిక్చర్స్‌వారి ''అనగనగా ఒక తండ్రి'' చిత్రం 11 రీళ్లు తయారైనట్టు, నిర్మాత మహేష్ చెప్పారు. ఈ చిత్రంలో ''భూలోకంలోనారదుడు'' అనే అంతర్నాటికను జొప్పించినట్టు చెప్పారు. (ఒకప్పుడు ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 'నారద' పేరిట పిట్ట కథగా వచ్చియుంది.) నారదుడిగా రాజబాబు, మహావిష్ణువుగా రమాప్రభ నటించారు.

అనగనగా ఒక తండ్రిగా గుమ్మడి, ఆయన భార్యగా సావిత్రి, వారి కన్నబిడ్డలుగా గిరిబాబు, రాజబాబు, రోజారమణి నటిస్తున్నారు. కన్నబిడ్డలు తల్లిదండ్రులను మరచిపోతే, పెంచిన బిడ్డ నేనున్నాను అని వాళ్లను సుఖపెడతాడు. ఆ బుద్ధిమంతుడి పాత్రను కృష్ణంరాజు పోషిస్తున్నాడు. అతగాడి ప్రేయసిగా భారతి నటిస్తున్నది. ముఖ్యమైన మరికొన్ని భూమికలను నాగభూషణం, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం ధరిస్తున్నారు. గిరిబాబుకు జంటగా విజయలలిత కనిపిస్తుంది. ఈ చిత్రానికి దాసరి మాటలను, చక్రవర్తి సంగీతాన్ని సమకూరుస్తున్నారు. ఛాయను జి. కె. రాము, కూర్పును హనుమంతరావు చేపట్టారు. సినిమా అనుకరణ, దర్శకత్వం సి. ఎస్. రావు నిర్వహిస్తున్నారు. విజయా విడుదల.

## ''భారతి''గా జమున

మనోరంజనీ పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి 'భారతి' అని పేరు పెట్టారు. భారతిగా జమున నటిస్తున్న యీ చిత్రానికి కథ, మాటలు, సినిమానువాదం, దర్శకత్వంను వీటూరి నిర్వహిస్తున్నారు. రెండవ కథానాయికగా లత నటిస్తున్నది. హాస్య జంటగా పద్మనాభం, రమాప్రభ కనిపిస్తారు. హీరోగా కృష్ణంరాజుకు తన టాలెంటును చూపించే మరొక ఛాన్సు యీ చిత్రంలో లభించింది. ప్రధాన పాత్రలను ఎస్వీ రంగారావు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, చంద్రమోహన్, నిర్మల పోషిస్తున్నారు. డిశంబరు యిరవైన యీ చిత్రం షూటింగు ప్రారంభమైంది. రెండు షెడ్యూల్సు జరిగింది. రెండు పాటల చిత్రీకరణ, కొన్ని ముఖ్య సన్ని



''సంసారం సాగరం''లో సత్యనారాయణ, జయంతి

వేశాల చిత్రీకరణ జరిగినట్టు, ఆరు రీళ్ల చిత్రం అయినట్టు నిర్మాణ నిర్వాహకుడు జె. ఎస్. కృష్ణంరాజు చెప్పారు. ఈ చిత్రానికి కోదండపాణి సంగీతాన్ని, దేవరాజ్ ఛాయను, భాస్కరరాజు కళను, వీరప్ప కూర్పును నిర్వహిస్తున్నారు. ఈ చిత్రాన్ని కె. వెంకట మునిరెడ్డి నిర్మిస్తున్నారు. విజయా విడుదల.

## ఘంటసాల గంధర్వగానం !

తారకరామ పిక్చర్స్‌వారి పాట ప్రసాద్ థియేటర్లో ధ్వనిముద్రణ జరిగిన సమయాన నేను అక్కడ వున్నాను. కొసరాజు వ్రాసిన—

''వేమన్న చెప్పింది వేదంరా
అది కాదన్నవాడు గాడిదరా
అనుమానముంటె అడగండిరా
అర్థాలు తెలుసుకుని తిరగండిరా''

పాటను ఘంటసాల, లీల కలిసి పాడారు.

ఘంటసాల పాడినప్పుడు నారద, తుంబురులు దిగివచ్చారా అనిపించింది. ఇటీవల ఆయన యింత బాగ పాడినపాట యిదేనేమో అనిపించింది. ఈ చిత్రానికి కె. వి. మహాదేవన్ సంగీత సారధి.

తారకరామా పిక్చర్స్‌కి కె. డి. వి. ప్రసాద్ అధినేత. ఈయన నిర్మిస్తున్న మూడవ చిత్రమిది. ఈ చిత్రానికి డి. యోగానంద్ దర్శకుడు. ఎన్టీఆర్, వాణిశ్రీ ప్రధాన జంటగా నటిస్తున్న యీ చిత్రానికి జాన్సన్ మాటలను, కృష్ణారావు కళను, ఛాయను సత్యనారాయణ నిర్వహిస్తున్నారు. సహాయ భూమికలను విజయలలిత, సత్యనారాయణ, రమాప్రభ ధరిస్తున్నారు. విజయా విడుదల.

## హిప్పీ గెటప్‌లో రాజబాబు!

వాహినీ స్టుడియో ఫస్టు ఫ్లోర్ వద్ద హిప్పీగెటప్‌లో ఒక వ్యక్తి కూర్చునియున్నాడు. ఆయన్ను వందమంది చుట్టుముట్టి యున్నారు, ఆటోగ్రావులో సంతకం పెట్టమని. ఎవరావ్యక్తి అని దగ్గరగా వెళ్లాను. ఇంకెవరు. మన రాజబాబే! ఏమిటీవేషం అని అడిగాను. ''రామారావుగారి 'తాతమ్మ కల' చిత్రంలో నా వేషం యిదే. నేను ఆయన కుమారుడ్ని'' అన్నారు రాజబాబు.

## జీవితరంగము

నవ్వులో విషాదం నింపుకుని పైకిమాత్రం నవ్వుతూ కనపడుతుంటారు కొందరు. హృదయమెంత ఆవేదనతో గూడుకట్టుకున్నను, పెదవిపై చిరునవ్వును ప్రదర్శిస్తూ, చింతలేనట్టు, అగుపడుతారు కొందరు. ప్రమీల ఆ కోవకు చెందినదే. అందుకే,

''నవ్వాలి, నవ్వాలి, నవ్వాలి
నవ్వుల్లో బ్రతుకంతా గడపాలి
కన్నీళ్లొచ్చేదాకా నవ్వాలి,
ఈ నవ్వులతో విధినికూడా గెలవాలి''

అంటూ పాడింది ప్రమీల. రాజశ్రీ వ్రాసిన పై పాటను రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో సుశీల హృద్యంగా పాడింది ''జీవితరంగము'' చిత్రంలో.

కుటుంబ క్షేమంకోసం తన క్షయాన్ని కూడా లెఖించక పాటుపడ్డ ఓ వనిత పాత్రను ప్రమీల పోషిస్తోంది, డాల్ఫిన్ ప్రజంట్స్ వారి ''జీవితరంగము'' చిత్రంలో. పేదరికం మనిషి నెంతగా పీడిస్తుంది, ఎన్ని అవమానాలకు. అభియోగాలకు గురిచేస్తుంది అనే నిజాన్ని ''జీవితరంగము'' చిత్రంలో ప్రత్యక్షంగా చూడొచ్చు.

పురోహితుడిగా గుమ్మడి నటిస్తున్న ఈ చిత్రంలో సావిత్రి, రమాప్రభ, చలం, జయసుధ, చంద్రమోహన్, రంగారావు ముఖ్య పాత్రధారులు. మాటలను రాజశ్రీ, కెమేరాను సుఖదేవ్, ఆర్టును సూరన్న, కూర్పును నరశింహారావు సమకూరుస్తున్న ఈ చిత్రానికి పి. డి. ప్రసాద్ దర్శకుడు. లక్ష్మీ విడుదల చేసే ఈ చిత్రానికి జి. నాగేశ్వరరావు నిర్మాత.

## అయిదు బాధ్యతలు !

పాపులర్ ఆర్ట్ పిక్చర్స్ వారి ''బడిగంటలు'' చిత్రానికి ''సినీ సుందరి'' సినిమా పత్రిక సంపాదకునిగా చలనచిత్ర పరిశ్రమకు పరచయమైన పాణ్యం చంద్రమౌళి అయిదు బాధ్యతలను అనగా కధను, కధనాన్ని, మాటలను, పాటలను, దర్శకత్వం బాధ్యతలను స్వీకరించారు.

పెండ్యాల నాగేశ్వరరావు సంగీత సారధ్యంలో ఇటీవల పాణ్యం చంద్రమౌళి రచించిన ''జోహార్ జయభారతి'' పాటను ఘంటసాల పాడారు. అన్నిరకాల జనాలను ఉత్తేజపరచే ఇలాంటి పాటను పదమూడు వత్సరాల తర్వాత వినే భాగ్యం కలిగిందని భావోద్రేకంతో అన్నారు ఘంటసాల.

పారశాల ఒక పవిత్ర దేవాలయం అనే

''అందరూ దొంగలే''లో లక్ష్మి

పరమసత్యాన్ని మూలకథగా ఎంచుకొని, ప్రతి చదువరుని నరనరాలలో ఈ భావం జీర్ణించుకుపొయ్యే విధంగా చిత్రాన్ని తయారు చెయ్యడానికి సన్నాహాలు చేస్తున్నారు నిర్మాత బుక్కపల్లి లక్ష్మీనారాయణ చౌదరి. నూతన నటీనటులతో నిర్మింపబడుతున్న ఈ చిత్రం తాలూకు షూటింగు బెంగుళూరు లోని కంఠీరవ స్టుడియోలో ప్రారంభమైంది.

## కృష్ణగా కృష్ణ

లక్ష్మీరమణ కంబైన్స్ పతాకంక్రింద ముస్తాబు అవుతున్న "ఇంటింటి కథ" చిత్రంలోని కృష్ణ పాత్రను హీరో కృష్ణ పోషిస్తున్నారు. ఈ చిత్రంలో "కృష్ణది వుత్కృష్టమైన పాత్ర. ప్రేక్షకుల హృదయాల్లో పదికాలాలపాటు నిలిచిపోయే పాత్ర" అంటున్నారు విషయం తెలిసిన కొందరు విశేకవంతులు.

నీతికి, నిజాయితీకి. తలవొగ్గి, తోడబుట్టిన అన్ననే పోలీసులకు పట్టిస్తాడు. కన్నతల్లిని కఠోర బాధలుపెట్టే కర్కోటకులైన అన్నలను ఎదిరించి, అన్యాయాన్ని అరికట్టి, తల్లి గుండెల్లో పన్నీరు చిలికిస్తాడు కృష్ణ. మైనపువొత్తి తాను కరిగిపోతున్నా, పదుగురికి వెలుగునిస్తుంది. కృష్ణ మనస్తత్వం అలాంటిదే. తానేమైపోయినా ఫరవాలేదు, కానీ తన్ను నమ్ముకున్నవారు కలకాలం కళకళలాడాలి అనేది కృష్ణ ఆశయం. తన ఆశయసిద్ధికోసం ఎన్నో ఆటంకాలను ఆనందంగా ఎదుర్కొంటాడు కృష్ణ.

ఎన్నో విజయవంతమైన చిత్రాలకు ఎడిటరుగా పనిచేసిన సత్యం దర్శకత్వంలో మనోహరంగా తయారౌతున్న ఈ చిత్రంలో



"ఇంటింటికథ"లో కృష్ణ



గుమ్మడి, సత్యనారాయణ, పద్మనాభం, అల్లు రామలింగయ్య, సాక్షిరంగారావు, రాంమోహన్, చంద్రకళ, అంజలి, రమాప్రభ, సుమ, హేమలత, ఛాయాదేవి, సునందని ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

కొమ్మినేని ప్రసాద్ సమర్పిస్తూ, కాకర్ల కృష్ణ నిర్మిస్తున్న ఈ చిత్రానికి పి. భాస్కరరావు ఛాయను, రమేష్‌నాయుడు సంగీతాన్ని, భాస్కరరాజు కళను, శరత్‌బాబు సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

## "మనుషుల్లో దేవుడు"

శ్రీ భాస్కర చిత్ర నిర్మించిన ఈ చిత్రంలో రామారావు, వాణిశ్రీలు పాల్గొన్న "వరూధినీ ప్రవరాఖ్యం" ఒక ప్రత్యేకత. మరొక ప్రత్యేకత ఏమిటంటే ?

### కృష్ణుడిగా నటరత్న కుమార్తె

"గోపాలా, నను పాలింపరావా
బృందావనిలో వేచితి రారా" అని

"రాధాకృష్ణులు" ఆనందానురాగాలతో మధుర మధురంగా పాడుకుంటూ, ఆడుకునే నృత్య నాటిక. రాధగా విజయలలిత, కృష్ణుడుగా నటరత్న ఎన్. టి. రామారావు గారి తృతీయ పుత్రిక కుమారి భువనేశ్వరి పాల్గొన్నారు. కథను తానే వ్రాసి, నటరత్న నాయకుడిగా, వాణిశ్రీ నాయకిగా పుండరీకాక్షయ్య నిర్మిస్తున్న ఈ చిత్రంలో గుమ్మడి, రేలంగి, కృష్ణంరాజు, రాజబాబు, ధూళిపాళ, సాక్షి రంగారావు, రామ్మోహన్,

డాక్టర్ రమేష్ రామదాసు, బి. సరోజాదేవి. విజయలలిత, అంజలీదేవి, నాగరత్నం, పి. ఆర్. వరలక్ష్మి తదితర తారాగణం.

అన్నపూర్ణా పంపిణీ చేస్తున్న ఈ చిత్రానికి గొల్లపూడి మాటలను, హనుమంతరావు సంగీతాన్ని, జె. సత్యనారాయణ ఛాయాగ్రహణాన్ని, కందస్వామి కూర్పును, గోఖలే కళను, వెంపటి చిన సత్యం నృత్యాన్ని నిర్వహిస్తున్నారు. రాయలసీమలో బలరామ్ పిక్చర్స్ ద్వారా, చిత్తూరు జిల్లాలో విజయనిర్మల పిక్చర్స్ ద్వారా, కర్ణాటకలో నవయుగ ఫిలింస్ సర్క్యూట్ ద్వారా విడుదలయ్యే ఈ చిత్రానికి కె. ఎ. ప్రసాద్ దర్శకుడు.

## దర్శకుడైన శ్రీనివాసరెడ్డి

యం. మల్లిఖార్జునరావు, పి. సాంబశివరావు, కె. వరప్రసాదరావుగార్ల వద్ద సహకార దర్శకుడిగా పనిచేసి, ఆ శాఖను కూలంకషంగా అర్థం చేసుకుని, సమయంకోసం ఎదురు చూస్తుండిన సి. శ్రీనివాసరెడ్డి ప్రేమాలయ మూవీస్ ప్రొడక్షన్ నెం. 1 చిత్రానికి దర్శకుడయ్యాడు తొలిసారిగా. ఇతను నెల్లూరీయుడు.

ఛాయాగ్రాహకుడు పి. దేవరాజ్ సమర్పిస్తున్న ఈ చిత్రం తాలూకు షూటింగు నెల్లూరు పరిసర ప్రాంతంలోని పల్లెసీమల్లో అవుట్‌డోర్‌లో జరుగుతుంది. 'గ్రామీణ వాతావరణం ఈ చిత్రంలోని ప్రధానాంశం. పి. శ్రీధరరావు కథను, స్క్రీన్‌ప్లేను నిర్వహిస్తున్న ఈ చిత్రానికి బి. శంకర్ సంగీతాన్ని, విజయరత్న మాటలను, కళాకర్ కళను, మోహన్ కూర్పును, దేవరాజ్ ఛాయను సమకూరుస్తున్నారు. రెండు షెడ్యూల్స్‌తో పూర్తికాబోయే ఈ చిత్రానికి బి. కేశవరాయుడు, కె. ప్రభాకర్ నిర్మాతలు. ఎస్. వి. రంగారావు, నాగభూషణం, ప్రసాద్ బాబు ('గీత' చిత్రం హీరో), వై విజయ, రాజశ్రీ, ఛాయాదేవి ముఖ్య పాత్రధారులు.

## "గీత" తర్వాత ?

చేతనా ప్రొడక్షన్స్‌వారు నిర్మించిన "గీత" చిత్రం ఆంధ్రలో విడుదలై, ఫరవాలేదనిపించుకుంది. ఆ చిత్రానికి పి. శేఖర్, బి. కేశవరావు నిర్మాతలు. ప్రస్తుతం పి. శేఖర్, పి. సూరిబాబులు కలిసి చేతనా కంబైన్స్ పతాకం క్రింద మళయాళంలో విజయభేరి




ప్రమోగించిన "స్త్రీ" చిత్రాన్ని తెలుగులో నిర్మించే ప్రయత్నాలు చేస్తున్నారు. జి. కె. మూర్తి ఈ చిత్రానికి దర్శకుడు.

## ఉగాదికి మరో చిత్రం

సంవత్సరాదికి మరో చిత్రం సెట్సు



"ఉత్తమ ఇల్లాలు"లో విజయభాను

మీదకు వెళ్ళనుంది. ఏమిటా చిత్రం ? "న్యాయానికి సంకెళ్ళు". ఎవరిదా చిత్రం ? కె. పి. ఆర్. మూవీస్ వారిది. స్క్రీన్‌ప్లే, దర్శకత్వంను సి. శ్రీనివాసరెడ్డి, ఛాయను దేవరాజ్, కథ, మాటలను ప్రేమ్ కుమార్ పొందుపరుస్తున్న ఈ చిత్రంలో ప్రసాద్‌బాబు హీరో. ("గీత" చిత్రం నాయకుడు).

## కృష్ణకిశోర్ ప్రొడక్షన్స్ !

'శారద' చిత్రానికి పంపిణీదారుడు, 'మమత' చిత్రానికి కారకుడు అయిన జోతీ శేఖర్‌బాబును గతవారం కలిశాను మీ తదుపరి చిత్రం ఏమిటి ? ఎప్పుడు ప్రారంభమవుతుంది ?" అని ప్రశ్నించాను.

"త్వరలో కృష్ణ, జమునలు నటించే 'షావుకారుగారి అల్లుడు' చిత్రాన్ని ప్రారంభిస్తాను. కలర్‌లో తీస్తాను.

ప్రసిద్ధ నవలా రచయిత్రి కోడూరి కౌసల్యాదేవి వ్రాసిన "ధర్మచక్రం" నవలను శోభన్‌బాబుతో నిర్మించదలిచాను. కలర్‌లో నిర్మితమయ్యే ఈ చిత్రాన్ని ఒక బాక్సాఫీస్ డైరెక్టరుకు అప్పగించాను ఆచార్య ఆత్రేయ రచన చేస్తున్నారు" అని చెప్పారు శేఖర్‌బాబు.

'ధర్మచక్రం' నవలను చలనచిత్రంగా నిర్మించాలని ఎందరో అనుకొన్నారు. చివరకు నిర్మించే అవకాశం శేఖర్‌బాబుకు లభించింది. ఈ కథను సక్రమంగా సినిమా అనుకరణ చేస్తే, మాటలు మనోహరంగా వ్రాస్తే చిత్రం ఘనవిజయం సాధించడం తథ్యం. పాత్రలకు సరితూగే నటీనటులు ఈ కథకు చాలా అవసరం.

## "బంగారు కలలు"

అన్నపూర్ణా పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చిత్రానికి "బంగారు కలలు" అని పేరుపెట్టారు. కథను ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి వ్రాశారు. ఆ కథకు సినిమా రూపాన్ని ప్రసిద్ధ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు యిస్తున్నారు. దర్శకత్వాన్ని ఆదుర్తి చేపట్టారు. ఈ చిత్రం నాలుగు షెడ్యూల్స్ హైదరాబాద్ సారథీలో జరిగింది. ఇన్‌డోర్ పూర్తయినట్టే.

"బంగారుకలలు" చిత్రంయొక్క అవుట్‌డోర్ షూటింగు గోవాలో పెట్టారు నిర్మాత మధుసూదనరావు. హీరో నాగేశ్వరరావు, లక్ష్మి పాల్గొనే పాటల చిత్రీకరణకోసం యీ లొకేషన్ ఎన్నుకోబడింది. ఈ చిత్రానికి సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు

వహీదారెహమాన్ నటిస్తున్న ఆఖరి తెలుగు చిత్రం యిదే అవుతుంది. ఆమె



ప్రముఖ కార్టూనిస్టు, రచయిత 'బాబు' (చి. కొలను వెంకట దుర్గాప్రసాద్)కి చి.సౌ. శాంతకుమారికి డిసెంబర్ 2, 1973 న, చీరాలలో వైభవంగా వివాహం జరిగింది.



క్రొత్తగా చిత్రాలను అంగీకరించడంలేదు. మధుసూదనరావుగారిమీద వున్న భక్తిచేత, ఆదుర్తిమీద వున్న గౌరవంచేత, అక్కినేని మీద వున్న అభిమానంచేత ఈ చిత్రాన్ని ఆమె అంగీకరించింది. ఈ చిత్రంలో రంగారావు, కాంతారావు, సత్యనారాయణ, రాజబాబు, అల్లురామలింగయ్య, గిరిబాబు, సూర్యకాంతం, మమత ప్రధాన తారాగణం. నవయుగ విడుదల.

## శ్రీశైలంలో వాణిశ్రీ

ఆంధ్రుల అగ్రనటి వాణిశ్రీ శ్రీశైలం వెళ్ళింది. మల్లికార్జునస్వామిని దర్శించడమే గాక గోపీకృష్ణ మూవీస్‌వారి షూటింగులో పాల్గొని నటించింది.

వాణిశ్రీతోబాటు ఆమె స్నేహితురాండ్రు కూడా శ్రీశైలం వెళ్ళారు. వాళ్ళు ఆమెను ఒక పాట పాడమని కోరారు. వాళ్ళ కోరికను ఆమె మన్నించింది. మల్లయ్యను స్తుతిస్తూ ఒక పాట పాడింది. ఆ పాటను కొసరాజు కలం రాసింది.

> ''శ్రీశైల మల్లయ్యా
> దైవమే నీవయ్యా
> శ్రీ భ్రమరాంబతో
> వెలసిన జంగమయ్యా'' —

ఈ పాటను సుశీల అద్భుతంగా పాడింది.

ఈ చిత్రానికి ''కృష్ణవేణి'' అని పేరు పెట్టినట్లు నిర్మాత చెలసాని గోపీ చెప్పారు. కథానాయకుడిగా కృష్ణంరాజు నటిస్తున్న యీ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు. ముఖ్య పాత్రలను గుమ్మడి, అంజలీదేవి, రాజబాబు పోషిస్తున్నారు. ఈ చిత్రానికి విజయభాస్కర్ సంగీతాన్ని, సూరన్న కళను, బొల్లిముంత మాటలను, మార్తాండ్ కూర్పును, కన్నప్ప ఛాయను నిర్వహిస్తున్నారు.

'కృష్ణవేణి' అవుట్‌డోర్ షూటింగు శ్రీశైలం, నాగార్జునసాగర్, అమరావతి, గుంటూరు మున్నగుచోట్ల జరగనున్నట్లు నిర్మాత చెప్పారు. లక్ష్మి విడుదల.

— శ్రీనివాస్

హిందీనటి రాఖీ—''బ్లాక్ మెయిల్''లో

సీరియల్.....

# పట్టిలోని కెరటాలు

ఎం.పి.ఆర్.రాధాకృష్ణ

(గత సంచిక తరువాయి)

మర్నాడే ఊడిపడ్డాడు రాజు.

"నాన్నగారు నిన్ను తీసుకు వచ్చేయమన్నా రమ్మా!" అన్నాడు వస్తూనే.

ఇంకా నాలుగు రోజులుండి, కూతురికి మంచీ ,చెడూ నూరి పోయాలనుకుంది జానకమ్మ. కాని, ఇప్పుడు రాజు రావటంతో ఆమె పథకం మారిపోయింది. మర్నాడు తెల్లవారు ఝామున, ఎక్స్‌ప్రెస్‌లో వెళ్లి పోవడానికి నిశ్చయమైంది.

ఆ రాత్రి భోజనాలయిన తరువాత, మేడ మీదకు చేరాడు రాజు. సుధాకర్ ఏదో చదువుకుంటున్నాడు.

రాజు రావడంతో, పుస్తకం మూసి... "రావోయ్... రా!" అంటూ ఆహ్వానించాడు.

రాజు గదినంతా ఒకసారి కలియచూసి ... "బాగానేవుంది ... మీ గది!" అన్నాడు కూర్చుంటూ.

"రామారావు బాగున్నాడా ?" అడిగాడు సుధాకర్.

రాజు చప్పరించేశాడు ... "ఏం బాగోలెండి ... అంతా బోర్..." అన్నాడు, నవ్వుతూ.

"అదేం ?"

"మీరే చెప్పండి బావగారూ రోజూ ఆఫీసు, ఇల్లు తప్పితే ఈ బ్రతుక్కి మరో ధ్యేయమే లేదా? ఎప్పుడైనా వదినతో వెళ్తే ఒక నాటకానికో, సినిమాకో వెళ్తాడు. ఆ మధ్య రంజీట్రోఫీ మాచ్ జరిగిందా! నేనూ, అక్కయ్య, విజయ వెళ్లాం! రావయ్యా — అంటే రాడు. చివరకు నాన్నగారు వచ్చారు గాని తను రాలేదు. అసలు, క్రికెట్ అంటే ఇంటరెస్ట్ లేనివాడికి లైఫ్‌లో థ్రిల్ ఏముంటుంది ?" అన్నాడు.

సుధాకర్ నవ్వాడు... "నీకు క్రికెట్ అంటే అంత అభిమానమా..." అడిగాడు.

"ఎంతో యిష్టం..." అన్నాడు రాజు, కళ్లు పెద్దవిచేసి.

"బెర్నార్డ్‌షా ఏమన్నాడో తెలుసా? క్రికెట్ అంటే... పదకొండుమంది మూర్ఖులు ఆడే ఆటను, 11 వేలమంది మూర్ఖులు చూడ్డం... అని!"

"అతనలా అన్నాడేమో నాకు తెలీదు కాని... అది పూర్తిగా తప్పు! మీ రెప్పుడైనా మాచ్ చూశారా ?"

లేదన్నట్లు తలాడించాడు సుధాకర్!

"అదీ సంగతి. అందుకే మీకూ, రామారావుకూ పొత్తు కుదిరింది. మాచ్ చూస్తే తెలిసేది... అందులో ఉన్న థ్రిల్! ఒకరు బౌల్ చేస్తుంటే, ఇంకొకరు బేట్ చేస్తారు! మిగిలిన ఫీల్డర్స్ కాచ్ కోసం ట్రై చేస్తుంటారు. భలే సర్దాగా ఉంటుంది. ఫోర్స్... సిక్సెస్ కొడుతూంటే చూడాలి... గోల... గోల..." ఉత్సాహంగా చెప్పాడు రాజు.

"ఏమిట్రా... బావగారి దగ్గర డబ్బాలు కొడుతున్నావ్...!" అంటూ వచ్చింది అరుణ.

"చూడవే అక్కా! బావగారికి క్రికెట్ కూడా తెలీదు. ఆట ఎలా ఆడ్తారో చెప్తున్నాను..." అన్నాడు గట్టిగా నవ్వుతూ.

"ఉద్ధరించావ్!... ఆయన క్రికెట్‌లో ఇంటర్ యూనివర్శిటి ప్లేయర్!"

రాజు, సుధాకర్‌వైపు ఆశ్చర్యంగా చూసి... "నిజమే!" అంటూ అడిగాడు.

సుధాకర్ నవ్వి... "అంతా వట్టిదే... మీ అక్క అబద్ధం చెప్తోంది. నమ్మకు..." అన్నాడు, అరుణవైపు చూస్తూ!

"అక్క అబద్ధాలాడదండోయ్! మొత్తం మీద భలేవారే! మీ మాటలు నమ్మడానికి వీల్లేదు!" రాజు తర్జని చూపిస్తూ అన్నాడు.

అరుణ, తనుకూడా కూర్చుంటూ... "ఏమిట్రా మనూరి సంగతులు! వసంత, అందరూ బావున్నారా ?" అంటూ అడిగింది.

"వసంతకేం... గుండులాఉంది..." అని ఆగి, ఏదో గుర్తుకు వచ్చినట్లు..." మొన్న శ్రీహరి వచ్చాడేవ్! నీ పెళ్లికి రాలేకపోయినందుకు భలే ఫీలయ్యాడులే! నీ కోసం ప్రజంటేషన్ కూడా తెచ్చాడు. ఇక్కడకు వచ్చేటపుడు తీసుకొని వద్దామనుకుంటూనే మర్చిపోయాను..." అన్నాడు.

అరుణ ఎగిరినంత పనిచేసి ... "శ్రీహరి వచ్చాడా! అప్పుడే ట్రయినింగ్ అయిపోయిందేమిటి? ఏంతెచ్చాడు? తీసుకురాలేకపోయావా ?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది.

"శ్రీహరి ఎవరు ?" అడిగాడు సుధాకర్.

"ఓహో...శ్రీహరి మీకు తెలీదుకదూ! మా ఎదురింటివాళ్ల అబ్బాయేలెండి. ఎం.ఏ. ఎకనామిక్స్‌లో యూనివర్శిటీ ఫస్ట్...! తరువాత ఐ. ఏ. ఎస్. కు సెలక్టయి ట్రయినింగుకు వెళ్లాడు. భలేవాడులెండి. అబ్బబ్బ... ఉత్తి కబుర్లపోగు ... నాన్నగారికి, అతనికి దోస్తీ ఎక్కువ. గంటలతరబడి చదరంగం ఆడుతూ గడిపేవాళ్లు." ఉత్సాహంగా చెప్పింది అరుణ.

"అప్పుడే కలెక్టరు అయిపోయినట్లు ఫోజు కొట్టబోయాడు. మనదగ్గర ఆ పప్పులు ఉడకలేదు..." అన్నాడు రాజు!

"అదిసరే ... మీసాలు అలానే ఉంచాడా, తగ్గించాడా ?"

"కొంచెం తగ్గించాడులే. ఇప్పుడు ప్రతి రోజూ గడ్డంకూడా గీసుకుంటున్నాడు. గురూ షర్టులు, సుర్వాలాంటి ఫేంట్లు మానేసి, బుద్ధిగా టెర్లిన్ బట్టలు కడుతున్నాడు. రెండురోజుల్లో వెళ్లిపోతానన్నాడు. వెళ్లిపోయాడేమో!"

"ఆ రోజు జ్ఞాపకముందికదురా నీకు! మనమంతా సినిమాకు వెళ్లాం. సిగరెట్ కాలుస్తూ కనిపించి, ఆతర్వాత ఇంట్లో చెప్పొద్దని భలే బ్రతిమాలుకున్నాడు. అబ్బ... భలే ఏడిపించాంకదూ!"

"అవునవును..."

చిన్నపిల్లల్లా మాట్లాడుకుంటున్న, వాళ్లను చూసి మనసులోనే నవ్వుకున్నాడు సుధాకర్.

'పెళ్లయినా ... అరుణలో ఇంకా చిన్నతనం, చిలిపితనం పోలేదు...' అనుకున్నాడు.

అలా అనుకోగానే, సాయంత్రం తల్లి అన్న మాటలు గుర్తువచ్చాయి.

"నువ్వెలా వేగుతావోగాని ... అది శతమొండిరా బాబూ! ఏం చూసి, ఇదే కావా

లని పట్టుబట్టావో ఏమో! ఒక మంచీ లేదు. మర్యాదా లేదు. పక్కింటి మామ్మ గారు చూద్దామని ఎంతో సరదాపడి వస్తే, కసిరికొట్టింది. చదువుకున్న పిల్లల్ని చూశానుగాని, ఇదెక్కడి తీరు?'' అంటూ నోరు నొక్కుకుంది.

'తనకూ తెలుసు ... అరుణ దూకుడుగా ప్రవర్తిస్తుందని! అయినా ... అది తెలియక చేసిందని, అదే సర్దుకుపోతుందని అనుకోరేం వీళ్ళు!'' అనుకున్నాడు.

''వస్తాను బావగారూ! రేప్పొద్దున్నే వెళ్లిపోతున్నాం. మీరు వైజాగ్ వెళ్లాక ఎప్పుడైనా వస్తాన్లెండి. గుడ్‌నైట్.'' అంటూ వెళ్లిపోయాడు రాజు.



సుధాకర్ అరుణవైపు చూశాడు.

ఏదో పుస్తకం పేజీలు తిప్పుతూంది...

''అరుణా...'' చిన్నగా పిలిచాడు.

పుస్తకం నుండి దృష్టి మరల్చి, 'ఏం' అన్నట్లు చూసింది.

''ఉదయం మామ్మగారు వస్తే, ఏదో అన్నావట!'' లాలనగా అడిగాడు.

అరుణ క్షణం మాట్లాడలేదు. తర్వాత అంది... ''మీదగ్గర పొద్దస్తమానం కూర్చో కూడదట చదువుకున్నదాన్ని గనుక నా ప్రవర్తన బాగాలేదట! అసలు ఆవిడెవరు? నన్నన డానికి?''

''నిజమే అనుకో! అయినా... వాళ్లేదో అంటారు. అననిస్తే ఏంపోయింది?''

''ఎందుకు అననివ్వాలి? నేనేమైనా అంటే వాళ్లూరుకుంటారా? ఈ ఇంటికి కొత్తదాన్ని గనుక, అన్ని ఆంక్షలూ నాకే విధించక పోతే. . ఎలా ఉండాలో కాస్త చెప్పొచ్చుగా! నాకేదయినా తెలియనపుడు సర్ది చెప్తే నేను కాదన్నానా? అలా కాకుండా, నేనేంచేసినా, వాళ్ళవైపు వింతగా చూస్తే, నాకెలా ఉంటుంది చెప్పండి?'' అరుణ గొంతు దుఃఖంతో బొంగురుపోయింది.

సుధాకర్ అరుణదగ్గరకు జరిగాడు... ''నిజమే! నీకు తెలియకపోవడం నీ తప్పుకాదు! బాధపడకు. నే నున్నాగా!'' అన్నాడు, ఆమె చేతుల్ని, తన చేతుల్లోనికి తీసుకుంటూ.

కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

''ఒక విషయం అడుగుతాను... ఏమీ అనుకోకుండా చెప్పాలి, మరి!'' అన్నాడు.

''అడగండి...''

''పెద్దవారిని గౌరవించడం తప్పంటావా?'' క్షణం తటపటాయించి అడిగాడు.

అరుణ, ఆశ్చర్యంగా చూసింది...''తప్పని ఎవరన్నారు!''

సుధాకర్ మాట్లాడలేదు!

అతని నుండి సమాధానం రాకపోయేసరికి, అరుణే అంది... ''పెద్దవారిని గౌరవించి తీరాలి... కానీ, భయంవల్ల కాకూడదు...''

''భయం లేకుండా, గౌరవం ఎలా సాధ్యం?''

''భయానికీ, గౌరవానికీ ముడిపెట్టకండి! భయం, ఎదుటివారి క్రూరత్వంనుండి జనిస్తుంది గౌరవం అనేది వారి మంచితనం నుండి పుట్టుకువస్తుంది.''

"అలా రెండింటిని వేరుచేయకు అరుణా! ఉదాహరణకు — నేను మా నాన్నగారి ఎదుట సిగరెట్లు కాల్చను. అంటే, ఆయనమీద నాకు గౌరవంలేదని అర్థమా?"

"ముమ్మాటికీ! ఇలా అంటున్నానని అన్యథా భావించకండి! ఆయనమీద మీకు నిజమైన గౌరవమే వుంటే, ఆయన ఎదురుగానే కాదు, పరోక్షంలోకూడా సిగరెట్లు కాల్చరు. ఆయనంటే మీకు గౌరవంలేదని అనను, కాని, గౌరవంకంటే, భయంపాలే హెచ్చు."

సుధాకర్, అరుణ తర్కానికి ఆశ్చర్యపోయాడు.

భార్య మాటలు బాగానే వున్నట్లనిపించినా, ఆమె ఆ మాటల్ని తననే ఉద్దేశించి అన్నట్లు భావించుకుని, చిన్నబుచ్చుకున్నాడు.

సుధాకర్ మనోభావాన్ని గ్రహించినట్లు, అరుణ నవ్వేసింది ... "చూశారా . . అప్పుడే చిన్నబుచ్చుకున్నారు. మీమీద విశ్వాసంతో, నా అభిప్రాయాన్ని నిష్కర్షగా చెప్పాను. అలా కాకుండా ... మీరేమనుకుంటారో అనే భయంతో, మీకు ప్రీతి కలిగించేలా, నా అభిప్రాయాన్ని నాలోనే దాచుకొని, ఇంకోలా చెప్పానే అనుకోండి ... మీరు సంతృప్తి పొందుతారు. కాని, మీ సంతృప్తి ... నేను నమ్మని విషయాన్ని మీకోసం అంగీకరించటం ద్వారా వచ్చినదే. అంటే అది మిమ్మల్ని మభ్యపరచటంకాదా? దీన్ని గౌరవించడమే నంటారా?" సూటిగా అడిగింది.

అరుణ చెప్పినదానిలో అసత్యం లేదని సుధాకర్‌కు తెలుసు. అయినా అంత వేగంగా ఆమెను అంగీకరించదలచుకోలేదు.

"మనం తప్పుచేస్తే ... తలిదండ్రులు దండిస్తారు. వాళ్లు దండిస్తారని భయపడి మనం కొన్ని, వాళ్లకోసం చేస్తాం. అది కూడా కేవలం భయంవలన తప్పించి, గౌరవంతో కూడినది కాదంటావా?" సూటిగా అడిగాడు.

"ఇది వేరు. తలిదండ్రులు మనల్ని కసిరినా, తిట్టినా, ఆ వెనుక ... అందులో మన మీద ప్రేమకూడా వుంది. ఏదైనా, తగు మోతాదులో వుండాలి. పిల్లల్ని ఊరికినే బాదేస్తే, వారిలో క్రమశిక్షణ వస్తుందనుకోవడం పొరపాటు! మా నాన్నగారు ఏనాడూ చెయ్యెత్తి ఒక్కదెబ్బ వేయలేదు. అందుకే ఆయనంటే అంతగౌరవం మాకు. క్రూరమైన దండనకంటే, ఆప్యాయతతో కూడిన అదలింపులోనే శక్తి వుంది. దండన, మనిషిలోని తిరుగుబాటు గుణాన్ని పెంపొందిస్తుంది ... అంతే!" అంది స్థిరంగా.

సుధాకర్ అరుణవైపు ఆశ్చర్యంగా చూశాడు.

'అమాయకురాలు ... చిన్నపిల్ల...' అనుకున్న అరుణలో ఇంత తర్కం వుందని వూహించలేకపోయాడు.

"అబ్బో ... చాలా తెలుసు నీకు! ఎక్కడ నేర్చుకున్నావ్ ఇదంతా?" నవ్వుతూ అడిగాడు.

"అన్నీ నేర్చుకున్నంతలో తెలియవు సార్..." కొంటెగా అంది.

"ఆహా ... అయితే అంతా స్వానుభవమే అన్నమాట!"

అరుణ గలగలా నవ్వేసింది ... "ఎక్కడి మనుషులండీ మీరు! విషం తాగితే చస్తామనే మాటకూడా అందరూ స్వానుభవంతోనే తెలుసుకుంటారా? కొన్ని మన అనుభవాల నుండి, మరికొన్ని ఎదుటివారి అనుభవాల నుండి తెలుసుకుంటాం. ఇంకా కొన్ని, పుస్తకాల ద్వారా తెలుస్తుంది."




'శభాష్ ... ఫరవాలేదు! కథలు వ్రాస్తే బాగా రాణిస్తావ్!" మెచ్చుకోలుగా అన్నాడు సుధాకర్.

"మీకు తెలీదులావుంది. నేను కథలు వ్రాస్తాను. బి. ఏ. సెకండియర్ చదివే రోజుల్లో, నేను వ్రాసిన కథకు బహుమతి కూడా వచ్చింది."

ఆశ్చర్యపోవడం ... తిరిగి సుధాకర్ వంతే అయింది.

"నిజం..." అన్నాడు నమ్మలేనట్లు.

"అగ్నిసాక్షిగా పెళ్లాడిన భర్తతో అబద్ధం చెప్తానా!" చిలిపిగా అంది.

అరుణను గాఢంగా హృదయానికి హత్తుకుని ... "నేను చాలా అదృష్టవంతుడిని..." అన్నాడు.

"పాపం! ఎందుకో..."

"ఎందుకేమిటి? సవ్యసాచివంటి భార్యవు దొరికావు. సర్వవిద్యా పారంగతురాలు, కుసుమ కోమల నవపల్లవ పారిజాత, మధుర దరస్మిత నయన చకోరి..."

"చాలు ... చాలు కాళిదాసును మించిపోయేలా వున్నారు!"

"కాళిదాసేం ఖర్మ ... వాల్మీకినే మించిపోతాను!"

ఇద్దరూ మనస్ఫూర్తిగా నవ్వుకున్నారు.

## 2

సుధాకర్ అరుణతో విశాఖపట్టణం వచ్చేశాడు.

కంపెనీ వాళ్లిచ్చిన అందమైన క్వార్టర్సులో, క్రొత్త సంసారం ప్రారంభమయింది

ఉదయం ఎనిమిదింటికి ఆఫీసుకు వెళ్లిపోతాడు సుధాకర్...పన్నెండుగంటలకు వచ్చి, భోజనంచేసి మళ్లీ వెళ్లిపోతాడు. గోడ గడియారం అయిదు కొడుతూంటే టంచనుగా ఇంటిముందు స్కూటరు దిగుతాడు

సాయంత్రాలు సినిమాకో, బీచ్‌కో ... ఎక్కడికీ వెళ్లాలని లేకపోతే, ఇంటిలోనే పేకాడుకుంటూనో గడిపేస్తారు

"అరుణా ... ఏమీ వ్రాయడంలేదేం?" అంటూ అడిగాడు సుధాకర్ ఒకరోజు!

"మీతో జీవితమే ఒక కమ్మటి కథలా వుంది. ఇంకేం వ్రాయను?" అంది నవ్వి అరుణ.

"గేయాలు వ్రాయి."

"దానికి భావస్పందన కావాలి!"

"ఏం! నీలో భావస్పందన కలగడం లేదా?" అరుణ కండ్లలోనికి చూస్తూ అడిగాడు.

అరుణ సిగ్గుపడింది ... "ఎన్నడూలేని ఆవేశం కలుగుతూంది. అదంతా వ్రాస్తే. . మీరు నవ్వుతారు."

"నవ్వను. ఒకవేళ నవ్వినా, అది ఆనందమే అనుకో! సరేనా?"

# అతని భావి మళ్లీ బాగుపడింది

ఒక ఏడాది క్రితము, అతని జీవితము అంధకార బంధురమవుతుందా అనే రోజు వచ్చింది. అతని కంటి పావకు (రెటీనా) తక్షణ శస్త్ర చికిత్స అవసరమయింది. దానికి 'లేసర్ బీమ్' కావాలన్నారు. అది భారతదేశములో లభించలేదు. ఒక పిల్లవాని చూపు సమస్య వస్తుందా రాదా అన్న వాటిమధ్య ఊగిసలాడింది

మమ్మల్ని సంప్రదించేరు 5 ఖండాలకూ యీ వార్త తెలిపి వెదకడము ప్రారంభమయింది. క్షణక్షణము వ్యాకులపాటుతో నిరీక్షించేము. ఎయిర్-ఇండియా ఉద్యోగులు ప్రపంచమంతటా ఆస్పత్రులను గాలించేరు. ఆఖరికి కావలసిన ఉపకరణములు మేన్‌హీమ్‌లో ఉన్నాయని తెలిసికొని అమ్మయ్య అనుకొన్నాము. ఆ పిల్లవానిని ఫ్రాంక్‌ఫర్టుకు విమానములో పంపేము. అక్కడనుండి వేరొక ఎయిర్‌లైను సహాయముతో వానిని మేన్‌హీమ్‌కు చేర్చేము.

నేడు, ఆ పిల్లవాడు సీతాకోకచిలుకను పట్టుకొంటున్నా, పువ్వులను కోస్తున్నా, రంగురంగుల వస్తువులను చూచి ఆనందిస్తున్నా, మా పనికి ఎంతో సంతోషపడతాము జనులను దేశవిదేశాలకు విమానములలో తీసుకు వెళ్లడమే మా పని అప్పుడప్పుడు, చీకటినుండి వెలుగుకు కూడ.

మీ అవసరమేదైనా సహాయపడుటకు మాకు సమాచారముల రాకపోకలకు విస్తారమైన ఏర్పాట్లు కలవు. మాకు ప్రపంచమంతటా 129 ఆఫీసులు మరియు 34 గమ్య స్థానములు ఉన్నాయి. కనుక మీకు దాదాపు ప్రపంచమంతటా స్నేహితులున్నారు మీకు అసాధారణమైనది ఏమేనా కావలస్తే మీకు లేదనకుండా సహాయపడే స్నేహితులు మీకు సేవ చేయుటకు అవకాశమివ్వండి. మీరు ఎయిర్-ఇండియాలోనే ప్రయాణము చేద్దామనుకొంటారు—ఎల్లప్పుడూ.




AI. 6130

ఆరోజు సాయంత్రం సుధాకర్ వచ్చేసరికి అరుణ ఏదో వ్రాసింది

'వసంత పురుషుడు...' అంటూ దానికి పేరు పెట్టింది.

''ఎవరీ వసంత పురుషుడు?'' అడిగాడు.

''చదవండి...''

'నాలో కలిగే భావ సంచలనానికి, ఉద్వేగానికి, మధురమైన ఊహలతో శరీరం పులకించడానికి ... నువ్వే కారణం...' అంటూ వ్రాసిన చిన్న గేయం అది.

సుధాకర్ ఆమెవైపు కొంటెగా చూసి... ''తెలిసింది...'' అన్నాడు.

''అన్నీ తెలిసీ అడుగుతారు ... చిలిపి చేష్టలు!''

''ఔనట! అలా అని నా వసంతసుందరి చెప్పింది.''

ఇద్దరూ నవ్వుకున్నారు.

''బి. ఏ., చదివే రోజుల్లో ఏదో వ్రాశానన్నావ్! ఎప్పుడూ చూపించలేదేం?'' అడిగాడు.

''అవి హైదరాబాద్‌లో ఉండిపోయాయి అయినా, వాటిలో చూడటాని కేంలేవు!''

''అలాక్కాదు. నేను చూడాలి.''

''సరే! ఈసారి వెళ్లినపుడు తెస్తాలెండి.''

రోజులు హాయిగా సాగిపోతున్నాయి.

''మీకో రహస్యం చెప్పాలి...!'' అంది ఒకరోజు, సుధాకర్ ఆఫీసునుండి రాగానే

''అంత రహస్యమా?'' అని చుట్టూ చూసి... ''ఎవరూ లేరు... చెప్పేసెయ్.''

''గట్టిగా చెప్పను! గాలి వింటుంది!''

''చిక్కే వచ్చిపడింది... మరెలా?''

''చెవిలో చెప్తాను...''

## ఏటిలోని కెరటాలు

సుధాకర్ ముందుకు వంగాడు.

అరుణ చెప్పిన విషయం విని... ఎగిరి గంతేయబోయి, నిలదొక్కుకొని... ''నిజం?'' అన్నాడు.

సమాధానంగా నవ్వి ఊరుకుంది.

''గుడ్ డే... గెట్‌రెడీ డార్లింగ్ ..ఇంత శుభవార్త వినిపించినందుకు నీకు సన్మానం చేయదలిచాను... వెంటనే బయల్దేరు! అలా షికార్లు కొట్టివద్దాం.. ఈ రోజంతా హాయిగా, ఆనందంగా గడిపేయాలి...'' అన్నాడు హుషారుగా.

* * *

తిరిగి వచ్చేసరికి పదకొండు గంటలైంది.

వరండాలో ఎవరో కూర్చుని ఉన్నారు. వీళ్లు రావడం చూసి లేచి నిలబడ్డాడు.

దగ్గరకు వచ్చి చూసి... ''అరే! శ్రీహరి! నువ్వా?'' ఆశ్చర్యంగా అంది అరుణ.

''తొమ్మిదిగంటల ఎక్స్‌ప్రెస్‌లో వచ్చాను. మీ నాన్నగారిచ్చిన ఎడ్రసు ప్రకారం ఇక్కడకు వస్తే, మీరు లేరు. తిరిగి ఏ హోటల్‌కో వెళ్లేబదులు, మీరు వచ్చేవరకూ వెయిట్ చేస్తే సరిపోతుందనుకుని, కూర్చున్నాను.'' అన్నాడు శ్రీహరి నవ్వుతూ.

''మంచివాడివే! రాక రాక వచ్చి హోటల్‌లో దిగిఉంటే, కాళ్లు విరగ్గొట్టి, బాయిలర్‌లో పారేద్దును. బ్రతికిపోయావ్!'' అని భర్త వైపు తిరిగి... ''మా శ్రీహరి... చెప్పానుగా... ఐ. ఏ. ఎస్...'' అని పరిచయం చేసి... ''మా శ్రీవారు. చూస్తున్నావుగా — అర్థమయే ఉంటుంది...'' అంది శ్రీహరితో.

''బయటనే నిలబడిపోయారు. లోనికి పదండి!'' అంటూ, తనుకూడా శ్రీహరి సామాన్లు పట్టుకొని లోనికి నడిచాడు సుధాకర్, శ్రీహరి వారిస్తున్నా వినకుండా.

''అంత పెద్ద కలెక్టరువి.. బయట వరండాలో కూర్చొని ఎదురుచూడ్డానికి సిగ్గెయ్యలేదూ!'' అడిగింది అరుణ.

''నీ దగ్గర సిగ్గేమిటి? అయినవాళ్ల దగ్గర కూడా బెట్టు చేయమంటావా?'' నవ్వాడు శ్రీహరి.

''సారీసర్! మా కబుర్లలోపడి మిమ్మల్ని మరిచిపోయాం! మిమ్మల్ని చూడటం ఇదే మొదటిసారయినా, మీ గురించి అంతా విన్నాను ఈ గడుగ్గాయి ముక్కుకు మంచి తాడు దొరికిందని చాలా ఆనందించాను!'' అన్నాడు సుధాకర్‌వైపు తిరిగి.

సుధాకర్ నవ్వేశాడు... ''మీ గురించి అరుణ చెప్పేది! అరుణ ద్వారా మీరు నాకు తెలిసినవారే. ఏ మొహమాటం పెట్టుకోకుండా, మీ యింట్లో ఉన్నట్లే భావించుకోండి.'' అన్నాడు.

''మెనీ, మెనీ థాంక్స్... మీరామాట అంటారని నాకు తెలుసు! ఎటొచ్చీ...ఈవిడగారే నన్ను వెళ్లగొడ్తుందేమో అని భయం వేసింది! ఈవిడ ఏం చెప్పినా నమ్మకండి.''

''అరే... చాలా నమ్మేశాను సుమండీ! మీమీద చాలా చాడీలు చెప్పింది! వీళ్లంతా కలిసి మిమ్మల్ని ఏడిపించేవారటగా!'' అన్నాడు సుధాకర్ నవ్వుతూ.

''చూశారా... అన్నీ అబద్ధాలే! అంతా వట్టిది!'' అన్నాడు శ్రీహరి.

''అబద్ధాలా? నిన్ను ఏడిపించలేదూ?'' అరుణ రెట్టించింది.

''వాదులాట తరువాత! ఆయన భోజనం సంగతి చూడు...'' సుధాకర్ జ్ఞాపకం చేశాడు.

అరుణ నవ్వేసింది. ''పోనిద్దురూ... ఒక పూట భోజనం లేనంతలో ఏమీ అయిపోదు. ఉపవాసం...వంటికి మంచిదికూడా!''

''ఒక పూట భోజనానికి పరవాలేదు. కానీ, ఏమీలేకుండా బ్రతకడం దుర్లభం! కాబట్టి సింపిల్‌గా ఏదైనా టిఫిను చాలు'' అన్నాడు శ్రీహరి.

అరుణ నవ్వుకుంటూ వంటింటివైపు దారితీసింది.

[ ఇంకా వుంది ]






అరుణతో పెళ్లి జరిగిపోయింది మాధవ్‌కి.

వెంటనే మాధవ్ వెంట వచ్చింది అరుణ.

కొత్తకాపురం ఎంతో ఆనందంగా లేక పోయినా — లోటు కూడా ఏమీలేదు. అరుణ అతన్ని నిండు మనసుతో చేసుకోలేదు. వసంత అతన్ని ప్రేమించినా. మానినా, మాధవ్ మాత్రం ఆమెని ప్రేమించాడు. అది నిజం. తల్లిదండ్రుల మాట కాదనలేక తల వంచ వలసి వచ్చింది. మరొక అమ్మాయిని — ఆమె తన చెల్లెలే కావచ్చు—ప్రేమించిన అబ్బాయిని పెళ్లి చేసుకోవలసి వచ్చినందుకు స్త్రీ సహజంగా కొంత అసంతృప్తి అనుభవించింది అరుణ. ఎంత దాచుకున్నా — నిర్లిప్తత బయటపడకుండానూ ఉండలేదు.

మాధవ్ కూడా వసంతను మరచిపోలేక

(గత సంచిక తరువాయి)

పోయాడు — అరుణని చేసుకున్నా. మామ గారి నుంచి ఉత్తరం వస్తే చాలు వసంత విశేషాలేమయినా ఉన్నాయేమో అని చూసే వాడు. ఏడాదికోసారి వసంత, మాధవులు కలుసుకునేవారు. బావ అన్న చనువుతో వసంత వ్యవహరించేది మాధవ్ కూడా ఆమె వుంటే హుషారుగా ఉండేవాడు.

ఇక్కడ అరుణ అపార్థం చేసుకునేది. మాధవ్ వసంతతో చిలిపిగా ప్రవర్తించడం ఆమెకు నచ్చేదికాదు. అటువంటి సన్నివేశాలకి తావివ్వకుండా ఉండేందుకు శాయశక్తులా ప్రయత్నించేది.

పుట్టింటికి వెళ్లేదికాదు. వాళ్లని ఆహ్వానించేది కాదు.

అరుణ కలలు విరిగి ముక్కలయ్యాయి. ఉదాసీనంగా గడవసాగింది జీవితం. మాధవ్ ఏంచేసినా అపరాధంలాగే కనిపించేదామె కళ్లకి. అసంతృప్తి నిండిన జీవితం ఐపోయిందామెకి.

రెండు మూడేళ్లకి ఆమె ఆరోగ్యం చాలా దెబ్బతింది.

మాధవ్ ఆమెను చాలామంది డాక్టర్ల వద్దకు తీసుకువెళ్లాడు. కాని — ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు. వైద్య శాస్త్రంలో మన శ్శాంతినివ్వగలిగే టానిక్ కానీ, మనోవేదనని నిర్మూలించగలిగే ఇంజెక్షన్లు గానీ యింకా కనిపెట్టలేదు. అందుచేత అరుణ అనారోగ్యం అలాగే ఉండిపోయింది.

మాధవ్ బాధపడటం మినహా ఏమీ చెయ్యలేకపోయాడు.

అరుణని వెర్రిగా ప్రేమించలేకపోయినా — ఆమెపట్ల అనాదరణ ఏమీలేదు. ఎటొచ్చీ

అతనామె హృదయంలోకి తొంగిచూసే ప్రయత్నాలు చెయ్యలేదు. అలా చెయ్యాలని అతని మెదడుకి తట్టలేదు.

ఒక చీకటిరాత్రి ... అరుణ అతన్ని దగ్గరగా పిలిచింది.

మాధవ్ ఆనందంగా ఆమెని సమీపించాడు.

అతని చేతిని తన చేతిలోకి తీసుకుని — "జరిగినదేదో జరిగిపోయింది. మళ్ళీ అటువంటి పొరపాటు జరగకుండా చూసుకోండి. నాకు సెలవు యివ్వండి—" అంది అరుణ కన్నీళ్లతో.

"ఏమిటి అరుణా నువ్వనేది?" భయంగా చూశాడు మాధవ్.

"నాకీజీవితం వద్దు. నేను చచ్చిపోతాను."

"అరుణా!—" బాధగా అరిచాడు మాధవ్. "నేను తప్పు చేశానా ?"

"లేదు. నేనే తప్పుచేశాను. ఇప్పుడవన్నీ దేనికి ? ఈ చివరి క్షణాలలో గతం తవ్వుకుని లాభమేమీ లేదు. మాధవ్... మీరు వసంతని చేసుకోండి. ఈపాటికి వసంత కూడా అన్నీ తెలుసుకుని ఉంటుంది "

అరుణ చనిపోయింది—మాధవ్ చేతులలో.

అతను దుఃఖం పట్టలేకపోయాడు. పశ్చాత్తాపం అతన్ని దహించి వేయసాగింది. అరుణని—చేతులారా చంపుకున్నాడా తను ?

ఆమెపట్ల అన్యాయంగా ప్రవర్తించాడా ?

అరుణని ప్రేమించలేదు. నిజమే. కాని—ఆమెను ద్వేషించలేదు. అదికూడా నిజమే. అరుణ తననెందుకర్థం చేసుకోలేక పోయింది? ఎందుకింత కఠినంగా శిక్షించింది?

పట్టలేని దుఃఖంలో మిగిలిపోయాడు మాధవ్.

వసంతా, వాళ్లమ్మా నాన్నా వచ్చారు.

ఏడ్పు ఆపుకోలేకపోయాడు మాధవ్.

ముఖ్యంగా—వాళ్ల సానుభూతివచనాలు... అవి మరీ బాధించాయి.

నేరస్తుడేమో అని తనబాధ. వాళ్లు తనని నిర్దోషి అనుకున్నారు !

వసంత ముఖం చూడలేకపోయాడు తను. వసంత కోసం తను అరుణ మరణాన్ని కోరుకున్నాడా ? అంత అల్పుడూ రాక్షసుడూ కాగలడా తను ? ఛి ! ఛీ ! !

మనసు విప్పి మాట్లాడుకో గలిగింది ఒక్క రావ్‌తోనే.

జరిగినదంతా అతనికి చెప్పేశాడు హృదయం కొంత తేలిక పడినట్లయింది.

వసంతని చూడటానికి భయం వేసే దా రోజుల్లో. అరుణ తనని వెంటాడుతున్నట్లే ఉండేది. వాళ్లు వెళ్లి పోయేవరకూ వసంత ముఖం చూడకుండా తప్పించుకున్నాడు.

తరువాత...ఇంకేముంది ?

నిర్లిప్తత నిండిన జీవితం.

దుర్భరంగా గడవ సాగింది కాలం.

వసంత ఎమ్మే ఐపోయింది. వాళ్ల నాన్నగారు ఉత్తరం వ్రాశారు. మామూలు సానుభూతితో పాటు వారి ఉత్తరంలో మరొక సూచన కూడా ఉంది. వసంత యిక చదవనందట. పెళ్లిచేసుకునే ఉద్దేశం కలిగినట్లు అనుమానం. కనుక—వసంతని అంగీకరింపజేసే ప్రయత్నాలు సాగించడం మంచిదని. తద్వారా సంబంధ బాంధవ్యాలు మళ్లీ కొనసాగుతాయని.

ఆ ఉత్తరం రావ్‌కి చూపించాడు మాధవ్.

"ఆయన వ్రాసింది అక్షరాలా నిజం. చాలా సమంజసంగా వ్రాశారు"అన్నాడు.

"కాని...వసంత... ?"

"వసంత నిన్ను అంగీకరిస్తుందేమో!—" ఆశాభావం వెలిబుచ్చాడు రావ్."ఆనాటి చిలిపితనం యిప్పుడు ఉండదు. ఎదిగిన వ్యక్తి కనుక పరిస్థితులు అర్థం చేసుకోగలదని ఆశించవచ్చు".

"థాంక్స్—" అన్నాడు మాధవ్.

అరుణ చనిపోయాక జీవితం చాలా దుస్సహం ఐపోయింది. ఒంటరితనం దుర్భరం ఐంది.

అరుణ చనిపోయిన మరునాటి దినంనుంచే మళ్లీపెళ్లి చేసుకోమని బంధువులూ మిత్రులూ పోరుతున్నారు. వారి మాటలు వినిపించుకోలేదు. పెళ్లంటూ చేసుకుంటె వసంతనే చేసుకోవాలి. అది అతని నిశ్చయం. కాని—వసంత మీద ఎన్ని ఆశలు ఉన్నాయో, అన్ని భయాలూ ఉన్నాయి. ఎగిరిపడే కెరటం లాటి అమ్మాయి వసంత. ఆమెకోసం నిరీక్షణలో కూడా అంతులేని సుఖం ఉంది.

ఇప్పుడు అవకాశం వచ్చింది.

వసంత—ఎమ్మే సైకాలజీ. ఇక చదవదు. అందుచేత పెళ్లి చేసుకునే మూడ్‌వచ్చి ఉంటుంది. అరుణ కోరిక కూడా తను వసంతని చేసుకోవాలనే. అందుచేత వసంత కోసం తను ప్రయత్నించడంలో తప్పేమీ ఉండదు. తను సఫలుడైతే తనతోపాటు అరుణ ఆత్మకి కూడా శాంతి లభిస్తుంది.

ఈ సారి వసంతతో చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి. తెలివిగా బిహేవ్ చెయ్యాలి. ఆమెను ఆకర్షించాలి. ఎలాగయినా ఆమె హృదయాన్ని పొందాలి. అపురూపమయిన ఆ వరం కోసం ఎంత కఠోర తపస్సు చేస్తే ఏం ?



మూడో రౌండ్ కూడా ఐంది.

మెల్లగా అన్నాడు రావ్. "మాధవ్, నీ కొక విషయం చెప్పాలి. వసంత రాబోతూంది కనుక—నువ్వా విషయం తప్పకుండా తెలుసుకోవాలి."

"ఏమిటది ?"

"కొంచం బాధాకరమైన విషయమే. ఐనా తప్పదు. ఒక్కసారి—క్షమించు -నీకు గతం గుర్తు చేస్తాను."

"చెప్పు, నేను మరచిపోగల్గితే కద ?"

"అదే చెప్పేది. గతం తాలూకు నీడలని చెరిపేసుకుని హృదయాన్ని స్వచ్ఛంగా ఉంచుకుని సిద్ధంగా ఉండాలి. వసంత కోసం—"

ఆత్రుతగా చూశాడు మాధవ్.

"అరుణ చనిపోయిన రోజులవి. నువ్వు దుఃఖంలో పూర్తిగా మునిగిపోయి ఉన్నావు. వసంతా వాళ్లూ వచ్చారు. వసంతని కన్నెత్తి చూడలేదు. పలకరించనయినా పలకరించ లేదు—"

"సారీ—"

"వసంత ఫీలింగ్స్ దెబ్బతిన్నాయి."

"ఆ!—"

"అవును. వసంత నిన్ను అలా ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు."

"రావ్ !—"

"ఏమందో తెలుసా ? విపరీతంగా మూవ్ ఐపోవడం తనకి నచ్చదట. అది వట్టి సెంటిమెంట్ అట !"

తెల్లబోయాడు మాధవ్.

అందుకేనా వసంత సానుభూతి కూడా చాలా పొడిగా ఉంది! తను పొరపాటు చేశాడా ?

ఏమో. ఇప్పుడాలోచిస్తూంటే ఒక చేదు నిజం బయటపడుతూంది. అరుణ మరణం నిజంగా తనలో కలిగించిన దుఃఖం కంటే — ఎక్కువ ప్రదర్శించాడేమో ఎందుకని ? వసంత సానుభూతి కోసమా ?

సిగ్గుపడ్డాడు మాధవ్.

ఆడపిల్లలా ఏడ్చిన తననిచూసి అప్పుడే మనుకుందో వసంత ?

ఆలోచించలేక పోయాడు మాధవ్.

రావ్ అన్నాడు—"వసంత సెంటిమెంట్లు కలిగినరాలు."

"ఊఁ ..." గొణిగాడు మాధవ్.

"నువ్వింకా వసంతను ప్రేమిస్తున్నావా?"

"సమాధానం నీకు తెలుసు. అరుణ అంత బాధపడి చేతులారా మృత్యువుని కొనితెచ్చుకున్నది—నా ప్రేమ మూలంగానే."

"ఆ రెండవ ఉత్తరం ఎవరు వ్రాశారు?"

"మా మామగారు."

"ఏమిటి వ్రాశారు ?"

"వసంత రాబోతూందని."

"ఐతే వసంత రావడం నిశ్చయమే అన్నమాట."

"ఊఁ."

"వసంత యిక్కడికి ఎందుకు వస్తూందో తెలుసా ?"

"ఆ విషయం రెండు ఉత్తరాలలోనూ లేదు."

"అది మనం ఊహించాలి."నవ్వాడు రావ్.

అతని ముఖంలోకి చూశాడు మాధవ్.

"వసంత నిన్ను ప్రేమిస్తూందేమో అని నా అనుమానం."

"..."

"బహుశా నిన్ను పెళ్లి చేసుకోవాలన్న ఉద్దేశం కూడా ఆమెకు కలిగిఉంటుంది."

"నేను నమ్మలేను."

"ఏం ?"

"ఆనాడు నేనెంత బ్రతిమాలినా అంగీకరించలేదు."

"కాని — నాటికీ నేటికీ చాలా తేడాఉంది. వసంత పెద్దదయింది. జీవితం అంటే అల్లరి కాదని తెలుసుకుని ఉంటుంది. మీ మామగారి ఉద్దేశం కూడా మారింది కదా ! వారికి వసంతను నీకిచ్చి చెయ్యాలనే ఉన్నట్టుంది."

"వసంత అంగీకారం లేకుండా ఆయనేమీ చెయ్యరు. పెళ్లివిషయంలో వసంతదే అంత అధికారమూ."

"ఔను. అందుకే వసంతని నువ్వు యింప్రెస్ చెయ్యాలి. ఎలాగూ యిక్కడికి రాబోతూంది కనుక — గట్టి ప్రయత్నం చెయ్యాలి"

మాధవ్ తల ఊపాడు.

## ప్రతిబింబాలు

"అప్పుడు నేను వసంతతో కొంచం మాట్లాడాను కదా? దానినిబట్టి ఆమె మనస్తత్వం కొంతవరకూ గ్రహించగలిగాను."

"చెప్పు."

"వసంతకి జీవితంపట్ల ఉండే దృక్పథం వేరు. సెంటిమెంట్స్ అంటే అసహ్యం."

"ఊఁ."

"మనం జాగ్రత్తగా ఆలోచించి ప్రణాళిక ప్రకారం అన్నీ జరిపించాలి."

"ఏమిటి?"




"వసంతకి చాలా అట్టహాసమైన ఆహ్వానం ఏర్పాటు చెయ్యాలి."

"సరే, ఎలా చేద్దామో చెప్పు."

"కాగితమూ కలమూ తీసుకురా."

"అవసరంలేదులే. చెప్పు. జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకుంటాను."

"ఆల్‌రైట్, శ్రద్ధగా విను. ఒక గదికి—కనీసం ఒక గదికి—ఫ్రెష్‌గా డిస్టెంపర్ వేయించు."

"అలాగే ఏ కలర్ ?"

"లేత నీలం."

"ఊఁ."

"రెండవది నీ సూట్లన్నీ అర్జంట్‌గా డ్రై క్లీనింగ్‌కిచ్చెయ్."

"అలాగే."

"హెయిర్‌స్టయిలు అప్‌టుడేట్ చెయ్యి."

"ఓకె."

"ముఖం మీంచి ట్రాజిక్ ఫీలింగ్స్ చెరిపి పారెయ్—"

"ఊఁ"

"ఆ ఫొటో...మరెక్కడికైనా మార్చు"

"అరుణ ఉండేటప్పుడు యిది బెడ్‌రూమ్ ఇప్పుడు..."

"ఫరవాలేదు ఆ ఫొటోని మూల గదికి మార్చు. అంతమాత్రాన అరుణకి అన్యాయం చేస్తున్నట్లు ఫీలవక్కర్లేదు."

"ఊఁ"

"ఫ్రిజ్‌లో సాఫ్ట్ డ్రింక్స్ ఉంచు. ముఖ్యంగా జిన్."

"ఆఁ."

"రేపే నాలుగు మంచి ఫొటోలు తీయించి ఒకటి డ్రాయింగ్ రూములోనూ, ఒకటి బెడ్ రూములోనూ వసంత రూములోనూ—మంచి ఫ్రేములతో హాంగ్ చేయించు. ఫ్రేములు డీసెంట్‌గా ఉండాలి సుమా."

"తప్పకుండా."

"బుక్‌రాక్‌లోంచి ఫిలాసఫీ పుస్తకాలూ చవుక బారువీ తీసేసి—మంచి పుస్తకాలు—అందమైన జాకెట్ ఉండేవి పెట్టు. లైట్ లిటరేచర్ తెలిసిందా ?"

"ఓ !"

"నాలుగు కొత్త రికార్డులు కొను. ప్లేయర్ ఆర్డర్‌లో ఉందా ?"

"ఊఁ"

"కారు కండిషన్‌లోనే ఉంది కదూ ? జాగ్రత్త సుమా...బ్యాటరీ చెక్ చేయించు."

"ఊఁ"

"మిర్రర్స్ పాలిష్ కొట్టించు."

"అలాగే."

"ఇప్పటికివి చాలు. మిగిలినవి తరవాత చెబుతాలే."

నాలుగో రౌండ్ పూర్తి చేశారిద్దరూ.

(ఇంకా వుంది)






# సక్రమంగా బ్రష్‌తో పళ్లను ఇగుళ్లను రోజూ తోముకుంటే పళ్ల ఇగుళ్ల బాధలను దంతక్షయమును నిలుపును

దంతవైద్యులు అంటున్నారు, ఇగుళ్లను గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుంచుకొనుటకు ఉత్తమ విధానం వాటిని సక్రమంగా రోజూ తోముకొనుచుండుటయే మరియు దంతక్షయమును నిలుపుటకు దంతక్షయ కారక ఆహార అణువులన్నిటిని నిర్మూలించే నిమిత్తం ప్రతి రాత్రి ఉదయమున ప్రతి భోజనానంతరం పళ్లను సక్రమంగా తోముకొను చుండవలెను.

మీ బిడ్డకు, ఒక దంతవైద్యునిచే ప్రత్యేకముగా సూత్రీకరించబడిన ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో నియమానుసారం పళ్ళు తోముకోవటం మరియు ఫోర్‌హాన్స్ డబుల్-ఏక్షన్ జూనియర్ టూత్ బ్రష్‌తో ఇగుళ్ళను తోముకోవటం నేర్పండి.

**ఫోర్‌హాన్స్ దంత సంరక్షణ ఎంత లేత ప్రాయంలో నేర్పితే అంత ఉత్తమం.**




**ఫోర్‌హాన్స్**

దంతవైద్యునిచే సృష్టించబడిన టూత్‌పేస్టు

**ఉచితం!** "దంతములు, ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను విలువైనట్టి చిన్న రంగుల పుస్తకము* ఈ కూపనుతో 20 పైసల తపాలా బిళ్ళలను (తపాలా ఖర్చులకు) మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ నం. 10031, బొంబాయి-1 కి పంపండి. AP-1

పేరు ______ వయస్సు ______

చిరునామా ______

* కావలసిన భాషను సూచిస్తూ దాని క్రింద గీత గీయండి: ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలి, అస్సామీస్, తమిళం, తెలుగు, మలయాళం లేక కన్నడ.

# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి...

**జి. బి. ఆర్. కాశీబుగ్గ.**

సంప్రదాయం అంటే ఏమిటి ?

మనకి—తరతరాలుగా వస్తున్న అల వాట్లలో మంచి చెడ్డలు.

**ఏ. టి. పెనుగొండ.**

ఇంక మానవజాతికి సంస్కారం అలవడాలంటే ఏమి చేయాలి ?

ఎంతో పరిణామం తరువాత— రూపమూ— అందుకు తగిన మెదడూ, దానికి తగిన సంస్కారమూ కలిగినదనేకదా— మనది మానవజాతి అన్నారు !

**వి. ఆర్. శివకోడు.**

దేవుడు లేని ఆలయం, సిరా లేని కలం . . . రెండూ ఉంటాయి !

**కే. బి. తొగరం.**

మా బామ్మ నన్ను ఒకొక్కసారి 'ఏరా సిగ్గు లేదూ మగపిల్లవాడివై ఉండి' అంటుంది. మరొక్క సారి 'నీకేం సిగ్గురా మగవాడివై ఉండి' అంటుంది. మరి రెండు సిగ్గులకూ తేడా ఏమిటి ?

సందర్భం— ఏ మాటకైనా సందర్భాన్నిబట్టే అర్థం వస్తుంది,

**పి. ఆర్. ఆర్. బొంబాయి.**

అక్కయ్యా, మనిషికి ఒక వ్యాధి ఉంది. దానికి మందు లేదు. ఆ వ్యాధి ఏమిటి ?

మనోవ్యాధి కాదు తమ్ముడూ— ఆ వ్యాధి కేన్సరు !

**కె. ఆర్. ఎస్. హోసూరు.**

మీరు స్త్రీ పక్షపాతి అని తెలిసి కూడా పురుషులు అభిమానిస్తున్నారంటే అది మీ జవాబుల చాతుర్యమేనంటే ఒప్పుకొంటారా ?

నాకింకా అంత గర్వం లేదండీ ! . . . నేను చెప్పే నిజాన్ని వారభిమానిస్తున్నారు— అనుకొంటున్నాను.

**డి. కె. పి. ఆర్. ఇందూరు (మధ్యప్రదేశ్)**

మీ అమ్మాయిని నేను కట్నం లేకుండా చేసుకొంటాను. మీరు తెగించకలరా ? మీ అమ్మాయి క్వాలిఫికేషన్లు చూశాకే లెండి.

చిత్తం— దీనిలో తెగించడానికి పణం ఒడ్డడానికీ ఏం లేదు . . . వీరికి వారెంతో వారికీ వీరంతే— మీరు 'కట్నం' అక్కరలేదన్నంత మాత్రాన మీరు సర్వలక్షణ సమన్వితులైనట్లు భావిస్తున్నారే ! !

**ఎమ్. ఎస్. ఎమ్. పర్లాఖిమిడి.**

జీవితంలో ఆశయముగా పెన్నుకొన్నదే సాధించలేనినాడు జీవించడమే వృథా అనిపిస్తుంది.

తప్పు : ఆశయం ఎత్తు పెంచండి. అప్పుడు సాధించినది తక్కువే అయినా— ఎక్కువ అనిపించడమేగాని జీవించాలన్న కోరిక కూడా పెరుగుతుంది. మీ ఆశయాల గుర్రపు బగ్గీని తారలకు తగిలిస్తే— కనీసం వృక్షాగ్రాలనైనా చేరుతుందని కదా ఆంగ్ల సామెత.

**వి. జె. అర్ మోరి.**

మిమ్మల్ని హీరోయిన్‌గా పెట్టి సినిమా తీస్తే నేను దివాలా ఎత్తుతా నంటారా ?

ఫరవాలేదు. వైడ్‌స్క్రీన్, సినిమాస్కోప్— చెయ్యండి — ఆ వింత చూడ్డానికేనా ఓ సారి వస్తారు !

**ఆర్. ఎమ్. ఎస్ సూళ్ళూరు పేట.**

ఏ వూరులో చూసినా కన్పిస్తున్న బాబాలు అమ్మల పై మీ అభిప్రాయం ఏమిటండీ ?

బాబాలూ అమ్మలూ దేవుళ్లు ఎలా అవుతారు ? . . . . .అదొక రకం వృత్తిగా మాత్రమే నేను గుర్తిస్తాను. నాకు భగవంతుడు — అనిర్వచనీయుడే కాదు — ఎప్పుడూ — అదృశ్యుడే. . . . .మనసు అలసినప్పుడు, శరీరం పట్టుతప్పినప్పుడు మనసుకి ధైర్యంచెప్పే శక్తి దైవం. దానికి ఏం పేరుపెట్టు కుంటారో — మీ యిష్టం.

**కాసుల్రావు, సునీత. పరకాల.**

పదవిలో వున్న మనిషి ప్రయోజకుడని చప్పట్లు కొట్టే యీ ప్రజలున్నంతవరకూ ఈ సమాజం బాగుపడడం జరుగదు.

ఏం మీరు సృష్టించే సమాజానికీ ప్రజల అక్కర లేదా !!

**సూర్యశ్రీ. కాశీబుగ్గ.**

చిన్నప్పటినుంచీ కనీ పెంచి పెద్ద చేసిన తల్లి కంటే సగంలో వచ్చి సర్వం తనదనుకొనే భార్యామణి కెందుకండీ అంత ప్రాముఖ్యం ?

వినలేదా ముందొచ్చిన చెవులకంటే వెనక వచ్చిన కొమ్ములే వాడి అన్నది. ●




# టెలిరాడ్ షాపుకు దయచేయండి, ఉత్తమమైన రేడియోను కొనండి!

"టెలిరాడ్‌ను కొనుగోలుచేసి ఒక బహుమతి పొందండి.
వివరములకు మీ డీలరును సంప్రదించండి"

Shilpi-TR 39A/73 Tel

''నా ఆశలన్నీ కూలిపోయాయి'' అన్నాడు భరద్వాజ నా ఎదురుగా కుర్చీలో కూర్చుని.

''ఏమయింది ?'' అడిగాను నేను.

''ఆడవాళ్లని నమ్మకూడదు ఏ దేశం వాళ్లయినాసరే. మన భారత స్త్రీ వీళ్లతో సమానమే.''

''తులసి విషయమా నువ్వు మాట్లాడేది ?'' అడిగాను భరద్వాజని

''అవును. నైతికంగా పతన మయింది'' అన్నాడు

''డామిట్ ఏమిటి నువ్వనేది!'' నాక్కోపం వచ్చింది

''తులసి పతిత '' గొంతు చించుకుని అరిచాడు భరద్వాజ. ఆ అరుపుకి అతని మెడ నరాలు వుబ్బటం స్పష్టంగా కనిపించింది.

''ఏం జరిగిందో వివరంగా చెప్పు'' అన్నాను డన్‌హిల్ సిగరెట్ వెలిగించి అందిస్తూ.

''ఇప్పుడే డాక్టర్ దగ్గరనుంచి వస్తున్నాను నా ఆరోగ్యం చెడిపోయింది. వెంటనే ట్రీట్‌మెంట్ తీసుకోవాలి.''

''నాకు అర్థంకాలేదు దానికీ, తులసికీ ఏం సంబంధమో?''

'' ది లవ్‌జెర్మ్. '' అన్నాడు బాధగా కోపంగా.

''ది లవ్‌జెర్మ్ ? ''

''యస్. ది లవ్‌జెర్మ్ !! ''

''అంటే ప్రేమ క్రిమియా?''

భరద్వాజ నా కళ్లలోకి సూటిగా చూస్తూ చెప్పాడు,కనురెప్పలయినాఆర్పకుండా. ''అంటే సుఖవ్యాధి''

పదునయిన కత్తి నాగుండెలోదిగినట్లుగా, కొరడాతో ఛెళ్లున కొట్టినట్లుగా ఫీలయ్యాను.

''గుడ్ హెవెన్స్ ష్యూర్?''

''ష్యూర్ బై ఆల్ మీన్స్ నీకు తెలుసు నేను తులసినితప్ప మరెవరినీ ఎరగనని ''

''లవ్‌జెర్మ్ అంటే. అదేం పేరు?''

''నన్ను పరీక్షచేసిన డాక్టర్ ఆ వ్యాధికి పెట్టిన నిక్‌నేమ్. ఒకరినొకరు ప్రేమించుకుంటే — మేకింగ్‌లవ్ — వచ్చే వ్యాధి ఇది. మలేరియాలాగా, క్షయలాగా, కుష్టులాగా ఈ వ్యాధి కూడా క్రిములు - జెర్మ్స్ ద్వారా అంటుకుంటుంది. అందుకని లవ్ జెర్మ్ అన్నాడు.''

కొన్ని క్షణాలు మా ఇద్దరిమధ్యా మౌనం రాజ్యం చేసింది. ఆ మౌనాన్ని భరించలేక అన్నాను. ''ఏ కాక్ టెయిల్ పార్టీలోనో మత్తులోనో నీకుతెలియకుండా ఎవరయినా ..''

''తులసి వచ్చిన ఈ రెండు నెలల్లో నేను ఏ పార్టీకి హాజరవలేదన్న సంగతి నీకు తెలుసు. నా కేరక్టర్ కూడా తెలుసు నీకు.''

''తులసితో చెప్పావా ?''

''లేదు. పరీక్ష చేయించాను. డాక్టర్ ట్రేస్ చేసాడు తులసిలో ఆ వ్యాధి ఉంది ''

తులసిని రెండు నెలల క్రితం లండన్‌లో హీత్ రో ఏర్‌పోర్ట్‌లో రిసీవ్ చేసుకున్న సంఘటన గుర్తొచ్చింది నాకు. నీలంరంగు పట్టుచీరెలో, నుదుట పావలా కాసంత కుంకంబొట్టుతో, కళ్లలో అమాయకత్వంతో, ఆ కొత్త వాతావరణానికి అలవాటుపడక పోవటంవల్ల మొహంలో బీతితోవున్న తులసిని చూసి 'ముగ్ధ' అనుకున్నాను నాగరికత అబ్బని పల్లెటూరి పిల్ల అనుకున్నాను

ఈ రెండు నెలలలో నాలుగయిదు సార్లు ''అవుటింగు''చేసాను నేను భరద్వాజ తులసిలతో. బకింగ్‌హామ్ పాలస్‌లో ఉదయం పదకొండున్నరకి 'ఛేంజ్ ఆఫ్ గార్డ్స్'. అల్బర్ట్ బ్రిడ్జినుంచి టవర్ బ్రిడ్జిదాకా థేమ్స్ నది మీద బోటు షికారు, రెజిమెంటల్ పార్క్‌లోని లండన్ జూ, బ్రిటీష్ మ్యూజియమ్ మీదుగా ఫ్లీట్‌స్ట్రీట్‌దాటి సెయింట్‌పాల్స్ కెథెడ్రిల్ ; థేమ్స్ నది ప్రక్కనేవున్న ముప్పై ఆరు అంతస్థుల విక్సెర్స్ స్కైస్క్రేపర్ ఎన్నో చూసాము.

తులసి పుత్తమ ఇల్లాలని, భరద్వాజ



అదృష్టవంతుడనీ ఎన్నోసార్లు అనుకున్నాను మనసులో.

"రేపు హాస్పిటల్‌కి వెళదాం" అన్నాను నేను భరద్వాజతో, తలవూపాడు అంగీకారంగా, ఎందుకని అడగకుండానే.

మర్నాడు ఉదయం మేం ఇద్దరం ట్యూబ్‌లో (అండర్ గ్రౌండ్ రైల్వే సిస్టమ్) చెల్సీలోవున్న రాయల్ హస్పిటల్‌కి వెళ్ళాం నర్స్ నా కుడిచేతి రక్తనాళంలోంచి నా రక్తం తీసుకుంది సిరంజిలో.

పేథాలజీ లేబరేటరీలో నా రక్తం పరీక్షించి సర్టిఫికేట్ ఇచ్చారు నాకు ఎలాంటి సుఖవ్యాధి లేదని ఆ సాయంత్రం రిపోర్ట్‌ని చూసిన భరద్వాజ కళ్ళు నా కళ్ళని కలుసుకున్నాయి కృతజ్ఞతగా నా భుజం నొక్కాడు ఆప్యాయంగా.

"నిన్నెప్పుడూ అనుమానించలేదురా అయినా ఎవరో తెలుసుకుని—అవసరం ఇక నా మనసు విరిగిపోయింది ఎప్పుడు నువ్వు మనదేశం వెళ్ళేది? నెల తర్వాతని చెప్పావు కదా?" అన్నాడు

"తులసి..." ఏదో చెప్పబోయాను.

"ఛేస్టిటీ ఈజ్ ల్యాక్ ఆఫ్ ఆపర్చునిటీ. దట్సిట్" తులసిగురించి మాట్లాడనివ్వలేదు భరద్వాజ నన్ను.

* * *

నిజమే. అవకాశం దొరక్క పోవటమే శీలం అంటే. తులసివల్ల అమాయకత్వంలో నిండిన తులసివల్ల, నాకు స్త్రీ జాతి మీద అసహ్యం ఏర్పడింది. భరద్వాజలాంటి మంచి వ్యక్తికి ఎంత అన్యాయం!

"మీరు తిరిగి వెళ్ళేటప్పుడు నన్ను తీసుకు వెళ్ళడం మర్చిపోకండి" అన్నది తులసి నాతో, రైల్లో తొందారం వెళ్తూంటే.

"ఇక మీరు లండన్‌కి వెళ్ళరు." అన్నాను కఠినంగా.

"ఆయన వచ్చేస్తున్నారా?"

"కాదు. మీ పేరులోని పవిత్రత మీలో లేకపోవడం వల్ల."

"అంటే?"

"మీరు లండన్‌లో మరొకరిని మరిగారని మాకు తెలుసు"

నా చెంప ఛెళ్ళుమంది వెంటనే. మిగతా ప్రయాణీకులంతా వింతగా చూస్తున్నారు మావంక. చెంపతడుముకుని అన్నాను.

"నిజం. మీ నుంచి భరద్వాజకి అంటుకున్న సుఖవ్యాధికంటె వేరే నిదర్శనం ఏం కావాలి?"

"ఏమిటి?" కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు తులసి మొహంలో. ఆశ్చర్యం, భయం, అసహ్యం తొంగి చూస్తున్నాయి

"అవును తిరిగిరాలేరని చెబితే నావెంబడి రారని మీ నుంచి ఈ సంగతి రహస్యంగా వుంచాము. భరద్వాజ మిమ్మల్ని వదిలేశాడు"

"నువు రాక్షసుడివి. ఆయన్ని ఏదో మాయ చేసావ్. నువు పిశాచానివి నువు ..నువు..." నాగుండెలమీద చేతులతో బాదుతూ అన్నది వెంటనే బిగుసుకు పోసాగింది ఏడుస్తూ.

హిస్టీరియా.

నీళ్ళుచల్లి సేదదీర్చారు ప్రయాణీకులు తులసిని. వెక్కి వెక్కి ఏడుస్తున్న తులసివంక చూడకుండా నేను సిగరెట్ తాగుతూ కిటికీ లోంచి బయటికి చూస్తూండిపోయాను.

భరద్వాజ మాటలు గుర్తుకొచ్చాయి

'ది లవ్ జెర్మ్'

'ఛేస్టిటీ ఈజ్ ల్యాక్ ఆఫ్ ఆపర్చునిటీ'

తులసి ఏడుపు కసితో నిండిన నా హృదయానికి హాయిగా వుంది.

కొత్త సిగరెట్ వెలిగించాను.

* * *

తులసిలో ఎంతో మార్పు వచ్చింది ఈ పదిహేను రోజుల్లోనే. ముఖంనిండా దిగులు, విచారం, లోతుకుపోయిన కళ్ళు. సరిగ్గా అన్నం తినటంలేదనుకున్నాను. అయినా తులసిమీద జాలివేయలేదు కొంచెంకూడా

తులసికి కొంచెం దూరంలో కాలేజీ స్టూడెంట్‌లా కనిపించే ఓ పంతొమ్మిదేళ్ళ కుర్రాడు కూర్చున్నాడు తలవంచుకుని.

"చెప్పండి. దేనికి పిలిచారు?" అడిగాను నేను. ఆ గదిలో వున్న నాలుగో వ్యక్తిని — డాక్టర్‌ని.

"తులసి అంతా చెప్పింది. తులసి తప్పు చెయ్యలేదు." చిరునవ్వుతో అన్నాడు డాక్టర్.

"రుజువు చేయండి. లండన్‌లోని రాయల్ హాస్పిటల్‌లోని డాక్టర్స్ చవటలుకారు."

"ఐ విల్. మై బోయ్. ఐవిల్" నవ్వుతూ అన్నాడు డాక్టర్.

"మీకు పూర్తిగా తెలియదయితే. సిఫిలిస్ చికిత్స పొందింది తులసి. ఆమెకి పెన్సిలిన్ ఇంట్రా మస్క్యులర్స్ యిచ్చారు"

"తులసికి ఆ వ్యాధి వుండటంవల్లనే అనుమానించారా?"

"అవును. ఇల్లాలికుండే వ్యాధికాదు వేశ్యలకుండే వ్యాధి అది."

"అంటే ఆ వ్యాధి వచ్చిన ప్రతివాళ్ళు వ్యభిచారులనేనా?"



"భర్త ద్వారా రానంతవరకు అంతే."

"మంచివాళ్ళకు కూడా రావచ్చు." అన్నాడు డాక్టర్ తీవ్రంగా.

"ప్రూవిట్ ఐసే."

డాక్టర్ ఆ కాలేజీ కుర్రాడివంక చూపించి అన్నాడు.

"బి. ఎస్‌సి. ఫైనల్. ఇరవైయేళ్ళు. వేశ్యలకి డబ్బిచ్చి కొనుక్కున్నాడు సిఫిలిస్‌ని. ఇతని ద్వారా వచ్చింది."

అతను కళ్ళెత్తి ఓసారి నావంక చూసి సిగ్గుతో తల దించుకున్నాడు వెంటనే.

"దేర్ యు ఆర్. షి ఈజిన్ట్ వర్చువస్" అన్నాను.

"షి ఈజ్. షి ఈజ్ వర్చువస్. ఇప్పుడు చెప్పేది శ్రద్ధగా వినండి కానుపు కష్టమయిందని, తులసికి బిడ్డ పుట్టి పోయాడని తెలుసు మీకు రక్తం చాలా పోయింది అప్పుడు తప్పనిసరిగా రక్తం ఎక్కించాల్సి వచ్చి, అందుబాటులోఉన్న ఇతని రక్తం ఎక్కించాము బ్లడ్‌గ్రూప్ సరిపోతే పరీక్ష చేసాను తర్వాత, ముందర సమయంచాలక. అప్పుడు ఇతని రక్తపరీక్షలో తేలింది ఆవ్యాధి గురించి. సిఫిలిస్ అనే ఆ వెనరల్ డిసీజ్ ఇతని రక్తం ద్వారాతప్ప మరోవిధంగా, ఊహించిన నీచమయిన విధంగా రాలేదు తులసికి. మైండ్ యు. రక్తం మార్పిడి వల్లనే"

"నిజంగానా?" గుండెలో గుచ్చుకున్న కత్తి బయటికి లాగినట్లయింది నాకు.

"ఆ సంగతి రిపోర్ట్ వ్రాసి తులసి చేతికి ఇచ్చాను. లండన్ వెళ్ళగానే అక్కడ డాక్టర్‌కి ఆ కాగితం చూపించమని నొక్కిచెప్పాను కాని అశ్రద్ధవల్ల మర్చిపోయింది ఆ రిపోర్ట్‌లో పరిస్థితి వివరించాను కూడా"

నాకు చలిజ్వరం వచ్చినట్లుగా వణికి పోయాను. తులసి వంక చూడలేకపోయాను.

"ఐయామ్ అఫుల్లీ సో సారీ డాక్."

"ప్రాయశ్చిత్తం ఒకటే. దంపతులని కలపండి. మీ ద్వారా అయితేనే సులభం అది" అన్నాడు డాక్టర్.

"తప్పకుండా" అన్నాను వుద్వేగంగా.

"నన్ను క్షమించమ్మా తులసీ" అన్నాను కాసేపాగి.

"ఇంత జరగడానికి కారణం ఆ వెధవ వ్యాధి. తనకి అది వుందని తెలిసీ నిర్లక్ష్యం చేసాడితను ఇంట్లో చెప్పడానికి భయపడి, చికిత్సకి డబ్బులేక. ఆ వ్యాధి అంచెలంచెలుమీద వృద్ధి అవుతుంది. లక్షణాలు బయటపడ నప్పుడు తగ్గిపోయిందనుకోవటం సహజం" అన్నాడు డాక్టరు.

"సుఖవ్యాధి అనేది దేముడి తప్పు" అన్నాను నేను.

"కాదు, అసలు మన వ్యవస్థలోనే, ఆలోచనా దృక్పథంలోనే వుంది లోపం. అదీ ఘోరమయిన తప్పని, ఎవరికీ చెప్పరు. చేత నయితే చికిత్స పొందుతారు. డబ్బులేక ఇలాంటి విద్యార్థులు, నిరుద్యోగులయితే గప్ చిప్‌గా వుండిపోయి, తాము మగ్గుతూ ఇతరులకి వ్యాప్తిచేస్తారు."

తలవూపాను నేను.

## అవ్ జెర్మ్

"పీపుల్ మస్ట్ రియలైజ్ టి. బి. లాగా, కేన్సర్ లాగా ఇదికూడా ఓ భయంకరమైన రోగం. గుండె, లివర్ చెడచ్చు పక్షవాతం, పిచ్చి రావచ్చు. చివరిదశలో మనిషే చచ్చి పోవచ్చు. ది సీజ్ నో సిన్. మన అవుట్ లుక్‌లో మార్పురావాలి.

మన అదృష్టంకొద్దీ దీనికిమందు కని పెట్టబడింది. పెన్సిలిన్. అంతకు మునుపు చికిత్సలేక అనేకమందికి రోమన్ రాజులు, కొలంబస్‌ఒంటి మహామహులు మరణించారు ఎందరో. ఈ వ్యాధి ప్రబలకపోతే అలెగ్జాండర్ సైన్యం ఇంకా యుద్ధం కొనసాగించి చరిత్ర గతిని మార్చివుండేది."

"టు హెల్ విత్ ది అవ్ జెర్మ్. ఎప్పుడు పుట్టిందో అసలు. ప్రస్తుతం తులసి రక్తంలో వున్న ఆ క్రిములకి ఎన్నివేల, లక్షల తరాల తాతలువున్నారో? వేల సంవత్సరాల క్రితం పుట్టి, హరించిపోకుండా అలాగే తరతరాలకీ వ్యాప్తి చెందుతూ వచ్చింది. ఇలా సాగాల్సిం దేనా? టి.బి. లాగా దీనికి నివారణోద్యమం లేదా? అడిగాను డాక్టరుని కొద్దిగా ఆవేశంగా.

"మీరు చెప్పింది చాలా ఆలోచించదగ్గ విషయం.

ప్రభుత్వంకానీ, సోషల్ వర్కర్సుకాని, సమాజంకానీ, డాక్టర్సు యూనియన్స్ కానీ, రోగపీడితులుకానీ—ఎవరూ అంతగాగుర్తించని శత్రువు ఈ రోగం. కేన్సర్‌కి రిసెర్చి చేస్తారు లక్షలు ఖర్చుచేసి. కాని దీన్నిగురించి ఆలోచిం చరు. కొన్ని ఆంధ్ర ప్రాంతాల్లో అసలు వ్యభిచారానికి 'చెక్' అనేదే లేదు ఎంత మాత్రం. ప్రతిసంవత్సరం ఈ రోగుల సంఖ్య విపరీతంగా పెరుగుతోంది.

ఉపన్యాసం అనుకోకండి బేర్ ఫేక్ట్స్ ఆఫ్ లైఫ్. ఎనభై శాతం కాలేజి విద్యార్థి దశలోని వాళ్లకే ఇది వస్తుంది. ప్రతికాలేజీలో పీరి యాడికల్‌గా అందరి రక్తం పరీక్షించి చికిత్స చేయాలి వెంటనే, అవసరంవున్న వాళ్లకి. చెక్ నంబర్ టు. అది ఎవరిద్వారా వచ్చిందో ఆరాతీసి వాళ్లకి కూడా చికిత్స చేయడానికి ప్రయత్నించాలి. ఈ ప్రాజెక్ట్సు అత్యవసరం.

చెక్ నంబర్ త్రీ టి. బి. నిర్మూలన పద్యమంలాగా, ప్రతి జిల్లా కేంద్రంలోనైనా కనీసం ఓక్లినిక్ ఏర్పాటుచేయాలి. వ్యాధి గ్రస్తులు జంకులేకుండా, ఉచితంగా చికిత్స చేసుకునేందుకు వీలుగా ఎందుకంటే ప్రొఫెష నల్స్ మామూలు వాళ్లకి అందుబాటులో వుండరు. డబ్బు సంపాదనె వాళ్ల లక్ష్యం?"

"తర్వాత?"

డాక్టరు చెప్పే విషయం ఇంటరెస్టింగ్‌గా వుండటంవల్ల అడిగాను.

"చెక్ నంబర్ ఫోర్. కాలేజెస్‌లో కనీసం నెలకో గంటయినా లైంగిక వ్యాధుల గురించి బోధించాలి విద్యార్థులకి, వాటి దుష్ఫలితాలు మొదలయినవి. భయంవల్ల బుద్ధిగా వుండక పోయినా, కొంతమందికయినా లాభిస్తుంది. సామాన్యులకి దాన్నిగురించి ఏమీ తెలియ దసలు.

చెక్ నంబర్ ఫైవ్. సంవత్సరంలో ఓసారి 'వెనరల్ డిసీజెస్ వీక్' ఏర్పాటుచేసి ప్రజలలో చైతన్యం తీసుకురావాలి 'నేషనల్ క్రైమ్ ప్రివెన్షన్ వీక్స్' లాగా. క్రైమ్స్ ఎంత సోషల్ ఈవిలో, ఇదికూడా అంతే."

సిగరెట్ అంటించాను నేను.

"చెక్ నంబర్ సిక్స్. ప్రభుత్వం ఇతర దేశాల్లోలాగా చేయాల్సిన ముఖ్యమయిన పని. లైసెన్స్‌డ్ ప్రాస్టిట్యూషన్, ప్రొహిబిషన్ లాగా. ఎనభై శాతం వ్యభిచారుల ద్వారానే ఇది వ్యాపించేది."

చెక్ నంబర్ సెవెన్. ప్రజలలో ఓవరాల్‌గా దీనిమీదవున్న అవుట్ లుక్ మారేలాచేయాలి

# దీ లర్ జెర్మ్

ఒక ఎవేర్‌నెస్ సృష్టించాలి...సారీ బోర్‌కొడుతున్నాననుకుంటాను'' అన్నాడు డాక్టర్ నవ్వి.

''కాదు. చాలా కొత్త విషయాలు చెప్పారు. ఇదే మీరు పబ్లిక్‌గా చెప్తే బహుశ నవ్వుతారు అంతా. నవ్వినాచెప్పడం మంచిదే'' లేస్తున్న నాతో అన్నాడు డాక్టరు.

''కాఫీ తీసుకు వెళ్ళండి.''

తొందారంనుంచి ఋక్కాములవచ్చేసాను. ఆ రోజే కేబుల్ పంపాను లండన్‌లోని భరద్వాజకి, ఇంటి అడ్రసుకి.

'తులసి ఈజ్ ఏజ్ వర్చువస్ ఏజ్ యువర్ మదర్ ఛేస్టిటీ ఈజ్‌నాట్ ల్యాక్ ఆఫ్ ఆపర్చునిటీ. ఛేస్టిటీ ఈజ్ లేక్ ఆఫ్ ఇమ్మోరాలిటీ. లెటర్ ఫాలోస్.''

ఆరోజే అంతా వివరంగా వ్రాసి పోస్ట్ చేసాను.

ఆరువందల ఇరవై అడుగుల ఎత్తుసే, పోస్టాఫీస్ టవరు పైన వున్న రివాల్వింగ్ రెస్టారెంట్‌లో కూర్చుని, దీపాలతో మెరిసి పోతున్న లండన్ నగర అందాన్ని చూస్తూ, తులసి, భరద్వాజ, నేను 'బ్లాక్ కాఫీ' త్రాగుతున్నాము—రెండు నెలల తర్వాత కబుర్లు చెప్పుకుంటూ.

# జెండా ఊంఛా

(12 వ పేజీ తరువాయి)

గుర్తించరు. అనేకన్నా వాళ్ళు పొందే వేదన యాతనలో అవి గుర్తుకురావు.

ఆనందరావు జానకిని దగ్గరగా తీసుకొన్నాడు. ఆమె ముఖం వివర్ణమైంది...ఆమె బాబాయి జబ్బుగురించి ఆలోచిస్తున్నది.

''ఏమిటి జానకీ అలా అయిపోయావు ఒక్కసారే.''

''ఏం లేదు—బాబాయి...''

''బాబాయి బాబాయికేం కాదు! బాగానే వుంటాడు.''

''మీరు జోస్యం కూడా చెప్పటం నేర్చుకున్నారా యేం? మనం ఇవ్వాళ సాయంకాలం వెళ్లాలి తప్పకుండా. మీరు లీవు పెట్టండి.''

''అవసరం లేదు.''

''ఏం ?''

''ఆ టెలిగ్రాం నేనే పంపించాను.''

''నిజంగా ?'' ఆశ్చర్యంలో మునిగిన జానకిని దగ్గరకు తీసుకొన్నాడు. పాఠశాలలో చప్పట్లు వినిపించాయి. జెండా గాలిలో ఎగురుతున్నది. జనగణమన గీతం ఆలాపన ప్రారంభమైంది.

**దేశంలో ప్రజాస్వామ్య పరిరక్షణకి పత్రికలు ప్రముఖ పాత్ర వహించాల్సి వున్నదంటూ - కొంతకాలం క్రిందట, కేంద్ర సమాచార శాఖలో**

పరిశోధనా విభాగంవారు ఒక నివేదిక తయారుచేస్తూ—అందులో ఒప్పుకున్నారు—అయితే న్యూస్‌ప్రింట్ లేనప్పుడు - పత్రికలు ఎలా అచ్చులవుతాయన్న విషయం కేంద్రం చేతులు కాలాకా ఆకులు పట్టుకున్న తీరున కూడా చేపట్టలేకపోయిందని పరిశీలకులు అంటున్నారు... నవంబరు నెలలో న్యూస్ ప్రింట్ కోటాపై 30 శాతం కోత విధించిన ప్రభుత్వం అసలు 31.7 శాతం న్యూస్ ప్రింట్ కొరత వున్నదని ప్రకటించింది!

2,30,000 టన్నులు కాగితం వుంటే దేశంలో చిన్నా పెద్దా పత్రికలన్నీ మామూలు శీర్షికలతో బజారులోకి రావచ్చును — కానీ విదేశాలనుంచి అనుకున్నదంతా [అసలంతా పైనుంచే రావాలి] వస్తే 1,57,100 టన్నులు మాత్రం అవుతుందని ప్రభుత్వం చెప్పింది — ఈ 157 వేల చిల్లర టన్నుల లోను 127 వేల టన్నులు కెనడా, స్కాండినేవియా, రష్యా, పోలండు, చివరికి బంగ్లాదేశ్ లాంటి దేశాలనుంచి రావాల్సిన బాపతు...

న్యూస్‌ప్రింట్ గురించి అశ్రద్ధ వహిస్తే....
మన తీర్మానాలు, వాగ్దానాలు
ప్రజలకి అందవు!



అయితే ప్రపంచం మొత్తంమీద న్యూస్ ప్రింట్ కొరత ఏర్పడిపోయింది—ఈ పరిస్థితిలో ప్రపంచంలో పాకిస్తాన్‌తోతప్ప న్యూస్ ప్రింటు ఉత్పత్తిలో మరేదేశంతోను మన దేశం తులతూగలేదు.




భారత్‌లోని పత్రికలు చిక్కి శల్యాలయిపోవటంలో ఆశ్చర్యం లేదు.

కొన్ని పెద్ద పత్రికలు ఉత్తరాదిన కొంతకాలం మూతపడ్డాయి — కొన్ని ప్రతిష్ఠగల పత్రికలు ఆదివారాలు శెలవు ప్రకటించాయి!

కథల నిడివి తగ్గింది. పేజీలు తగ్గిపోయాయి! శీర్షికలు లేచిపోయాయి! ప్రకటనలు పెద్దసైజువి వెతుక్కుంటూ వచ్చినా వద్దనే దుస్థితి యేర్పడి పోయిందిట! చిన్న చిన్న పత్రికలకు కోత లేదు కనుక వారి న్యూస్ ప్రింట్ యితరులకు దొడ్డి దారంట దొరకవచ్చు!

అయితే బ్లాక్‌మార్కెట్‌లో న్యూస్ ప్రింట్ టన్ను నాలుగువేల నాలుగొందల రేటుకి అంటే అసలు రేటుకి రెండున్నర మూడు రెట్లన్నమాట—తప్ప దొరకటంలేదట! కాని యిలా కొని భరించగలగటం — సామాన్య పాఠకుని తరంకాదు [అప్పుడు పాఠకుడు ప్రకటనదారూ కొంత మోయాలికనుక యిలా అనుకోడంలో తప్పులేదు] — నాలుగు పేజీలలో కత్తిరించిన వార్తలతో, కుదించిన శీర్షికలతో వస్తున్న పత్రికల్లో కొన్ని ఆంగ్ల పత్రికల ధరలు బాగా పెరిగాయి. కొన్ని దేశవాళీ పత్రికల ధరలు ఓ మోస్తరుగా పెరిగాయి!

దేశంలో 40 వేల టన్నులు [నాసిరకం] న్యూస్‌ప్రింట్ మాత్రం ఉత్పత్తి అయినంత కాలం—ప్రజాస్వామ్య పరిరక్షణలో పత్రికల కన్నా వోట్ల ధరలకే ప్రాధాన్యత ఉండక తప్పదంటున్నారు ఏపుర్వులు 'నేపా'మిల్లులు అంటూ మధ్యప్రదేశ్‌లో వున్నాయి — వీటి ఉత్పత్తి దేశంలోని అవసరాలలో 18 శాతం కూడా తీర్చలేదు! దేశంలో 17 నుంచి 18 వందలదాకా న్యూస్ పేపరలున్నాయి!—ఇవాళ వీటిస్థితి దయనీయమైంది!

పాతపేపరులు కొంటామనేవారు లోగడ సేకరించిన పేపరుకు రెట్టింపు ధర యిస్తే తప్ప—అంత పేపరు దొరకటంలేదంటున్నారు— ఇరుగు పొరుగులు చింపకుండా పేపరు పంచుకోలేక పోతున్నాయి. అంటున్నారు — పాఠకులు!

మంత్రుల వుపన్యాసాలు 'కట్' అయిపోతున్నాయి. స్థానికవార్తల్లో పది మంది మృత్యువాత పడితేతప్ప కనపడేటంత వార్త పత్రికకి ఎక్కటంలేదు. లోగడ చిలీలో భూకంపానికి పతాకశీర్షికలెత్తే ప్రాంతీయ భాషా పత్రికలు యిప్పుడు 'వాటర్‌గేట్' తరువాత యుద్ధం, బ్రెజ్నేవ్ యాత్రని మాత్రం పెద్ద అక్షరాల్లో వేశాయి—

విదేశీ వార్తలు మచ్చుకి—దేశీయ వార్తలు సంక్షిప్తంగాను— వేస్తూ పత్రికలు - నిండు పేజీ సినిమా ప్రకటనలుకూడా అరపేజీకి తగ్గించుకుంటున్నాయి!

ఆదివారం సంచికలో శీర్షికలు రోజు రోజుకి చిక్కిపోతున్నాయి! వారఫలాల నిడివి సైతం దినఫలంసైజుకి వస్తోంది! సినీ రివ్యూలు మినీరివ్యూలయినాయి.

విలేఖరులు అసెంబ్లీలో కూడా 'షార్టు హ్యాండు' రాయటంకన్నా ముఖ్యమైన మూడు

(48వ పేజీ చూడండి)

కాయితాలు లేవుట!
మిరపకాయలు
జేబులో పోసాడు!



# వారఫలం

మహేష్

## 25-1-1974 శుక్రవారం మొదలు 31-1-1974 గురువారం వరకు

**మేషం :—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో ఎవరిని విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలుఅనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృషభం :—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా ఫలితం దక్కదు. అధిక వ్యయం జరుగు తుంది. స్త్రీలకు – కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్య కార్యలు చేస్తారు.

**మిధునం :—** అన్ని వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:—** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టంవస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి దైవకార్యాలు నెరవేరతాయి.

**సింహం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు – ఆరోగ్యం బాగుండదు బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య :—** మీ కార్యక్రమాలకు పూర్వులు వస్తాయి. పాటివారితో మాట పట్టింపులు తగవు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో కొన్ని వ్యవహారల్లో ప్రయాసమీరాది ప్రయోజనం మరొకరిది కావచ్చును. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**తుల :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయవ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. పాటివారిలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభించగలదు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కావలసి వస్తుంది. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు :—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగుంటాయి. భవిష్యత్తులో మీకు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**మకరం :—** మీ కార్యక్రమాలు అనుకున్నట్లుగా నెరవేరతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోష కరమైన వార్తలను వింటారు.

**కుంభం :—** వృత్తి వ్యాపారలు బాగుంటాయి. పాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలో పనలు చేస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగు తుంది. ●

# కడుపు సరిగ్గా లేదా?

వాయువు?
కడుపులో ఆమ్లము?
గుండెల్లో మంట?
అజీర్ణము?



## 2 రెన్నీ నమలండి, సత్వరం కడుపులో హాయిగా వుంటుంది

| కడుపు సరిగా లేక మీరు బాధ పడుతున్నారా? | అవును | కాదు |
| --- | --- | --- |
| 1. భోజనం చేసిన తరువాత ఎక్కువుడు కడుపు నిండుగా ఉన్నట్లు అసౌఖ్యంగా మీకు అనిపిస్తుందా? | | |
| 2 భోజనం తరువాత మీకు సాధారణంగా నొప్పి వస్తుందా? | | |
| 3 కొన్ని పదార్థాలు మీకు అసౌఖ్యం లేక బాధ కలిగిస్తున్నట్లు గమనించారా? | | |
| 4 మీకు మానసిక బాధ లేక ఆందోళనగా ఉన్నప్పుడు మీకు కడుపులో నొప్పి వస్తుందా? | | |
| 5 గుండెమంట మీకు రాత్రి నిద్ర లేకుండా చేస్తుందా? | | |
| 6 అధికంగా పొగ త్రాగిన లేక పుగాకు నమిలిన తరువాత మీకు అజీర్ణం బాధ కలుగుతుందా? | | |
| 7 మీకు ఆకలి నొప్పులు కలుగుతాయా? | | |
| 8 అకాల భోజనాలు మీకు నొప్పి కలిగిస్తాయా? | | |
| 9 మత్తు పానీయాలు త్రాగిన తరువాత మీకు మంట వస్తుందా? | | |

మీరు 3 సంఖ్యలకు పైగా అవును అని లెక్కిస్తే బహుశా మీ సమస్య అధికమైన కడుపులో ఆమ్లము అయివుండ వచ్చును

### కడుపులో ఆమ్లము ఏది కలుగ చేస్తుంది?

జీర్ణానికి అవసరమగు ఆమ్లమును కడుపు తయారు చేస్తుంది కాని కొన్ని కడుపులు అవసరమైన దాని కన్నా ఎక్కువ ఆమ్లాన్ని తయారు చేస్తాయి ఈ అధిక ఆమ్లము వలనే ఆమ్లము కడుపు అజీర్ణ బాధ సరాల అజీర్ణ రోగం గుండెల్లో మంట వంట బాధలు కలుగుతాయి ఈ అధికమైన దాన్ని వెంటనే సరి చేయాలి ఈ సురక్షితమైన సత్వర చర్య కోసం మీకు రెన్నీ అవసరం

### కడుపులో ఆమ్లమును నివారించుట ఎట్లా?

కడుపులో ఆమ్లానికి అత్యుత్తమమైన నివారిణి-సత్వరమైన,సౌమ్యమైన చర్య గల ఆమ్ల వ్యతిరేకం—రెన్నీ రెన్నీ బాధను నిర్మూలించేందుకు అవసరమైనంత ఆమ్లాన్ని మాత్రమే తగ్గిస్తుంది అంతేకాని జీర్ణమునకు అడ్డు తగిలేటంత మాత్రము కాదు కడుపు బాధ నుంచి సత్వర నివారణ కోసం 2 రెన్నీ నమలండి రెన్నీ ప్రపంచమంతటా చాలా మందిచే వాడబడుతోంది

రెన్నీ కడుపులో బాధను పోగొట్టుటకు మంచిది ఎందువలనంటే ఆమ్ల వ్యతిరేక మందు చేయవలసిన ఆరు పనుల నన్నింటిని అది చేస్తుంది

1 రెన్నీ శీఘ్రంగా నిశ్చయంగా నిమిషాలలో ఉపశమనము నిచ్చును
2 రెన్నీ వాయువు కలుగుటను ఆపును
3 రెన్నీ సరియైన ఆమ్లతను నిలబెట్టును
4 రెన్నీ మామూలు జీర్ణ పద్ధతికి ఆటంకముగా వుండదు
5 రెన్నీ కడుపు పొర మీద సురక్షితమైన పూత నిచ్చును
6 రెన్నీ తరచు తీసుకొన్నప్పటికి విరేచనములుగాని మలబద్ధకముగాని కలుగచేయదు

## 2 రెన్నీ టేబ్లెట్లు మీ కడుపును హాయిగా వుంచును

పిప్పరమెంటు రుచిగల రెన్నీ దగ్గర వుంచుకోండి

ఒక నికోలస్ (N) ఉత్పాదన

mcm/ni/4 tel

# ఫిలిం బ్యాలట్ : పాఠకులకు విజ్ఞప్తి

- ఏటా నిర్వహిస్తున్నట్లే యీ ఏడుకూడా ఫిలిం బ్యాలట్ నిర్వహిస్తున్నాము పాఠకులు ఉత్సాహంగా పాల్గొంటారని ఆశిస్తున్నాము
- బ్యాలట్ పత్రాన్ని నింపేముందు యీ నిబంధనలు గమనించమని కోరుతున్నాము
- ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రకటించిన బ్యాలెట్ పత్రాన్ని మాత్రమే వాడాలి వేరే కాగితంపై వ్రాసినవి చెల్లవు
- పత్రంలో ఎన్నుకున్నవారి పేర్లు స్పష్టంగా, విడివిడిగా సిరాతోనే వ్రాయాలి పంపినవారి పూర్తి పేరు, చిరునామా వుండితీరాలి కవరుపై 'సినిమా బ్యాలట్' అని వ్రాయడం అవసరం బ్యాలట్ పత్రాలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–3 అన్న చిరునామాకి పంపాలి
- పాఠకులంతా మాతో సహకరించి యీ బ్యాలట్‌ను జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము
- బ్యాలట్ ఫలితాల ప్రకటన తేదీని రాబోయే సంచికలలో తెలుపుతాము

**ముగింపు తేదీ : 6-2-1974**

– – – – – – ఇక్కడ కత్తిరించండి – – – – – –

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఫిలిం బ్యాలట్ పత్రం

| | | |
|---|---|---|
| [1] | ఉత్తమ చిత్రం | |
| [2] | ఉత్తమ దర్శకుడు | |
| [3] | ఉత్తమ నటుడు | |
| [4] | ఉత్తమ నటి | |
| [5] | ఉత్తమ సహాయ నటుడు | |
| [6] | ఉత్తమ సహాయ నటి | |
| [7] | ఉత్తమ హాస్య నటుడు | |
| [8] | ఉత్తమ సంగీత దర్శకుడు | |

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

– – – – – – ఇక్కడ కత్తిరించండి – – – – – –

# ఆమె రాచరిక సౌందర్య రహస్యం

# ఐటెక్స్

## సౌందర్య సాధనములు

ముప్పై
సంవత్సరములకు
పైగా ప్రసిద్ధి
చెందిన సౌందర్య
పరికరాలు.




**Aravind Laboratories**
MADRAS-33